ఏప్రిల్ 2009 ▪ Rs.20/-



# చందమామ







బిల్లు, రోహన్ ట్రీట్ లాక్కోవాలని చూస్తాడు! కాని బిల్లు ఆశ్చర్యపోతాడు!







పచాక్!!





పిచ్‌కూ నొక్కండి ట్రీట్ రక్షించండి



















చందమామ    సంపుటి: 62    ఏప్రిల్ 2009    సంచిక:04

## ఈ సంచికలో...





## ఈ నెల విశేషాలు















# సెలవులు వచ్చేశాయి!

ఈ సంచిక మీ చేతుల్లోకి వచ్చేసరికే ప్రియపాఠకులైన మీలో చాలా మందికి వేసవి సెలవులు ఆరంభమై ఉంటాయి. మీరు ఆశించే వినోదాలకు అంతరాయం కలగకుండా వేసవి సెలవులను ఉపయోగకరంగా గడిపే మార్గాలు చాలా ఉన్నాయి. సెలవులు ముగిసేలోపల(ముగియక తప్పదు కదా మరి!) మీరు మరింత నిండైన వ్యక్తిత్వం సంతరించుకున్న విద్యార్థి(ని)గా మిమ్మల్ని మీరు మలుచుకునే అవకాశాలు కోకొల్లలు. అలా అని మీరు వినోదంగా గడపాలని వేసుకున్న పథకాలను, చేయదలచుకున్న ప్రయాణాలను రద్దు చేయవలసిన అవసరం లేదు. చేయవలసిందల్లా వినోదభరిత వాతావరణంలో నూతన విషయాలను నేర్చుకోవడం కొనసాగించడం మాత్రమే!

మీ వినోద కార్యకలాపాలలో అంతర్భాగంగా వేసవి సెలవుల్లో చేయతగ్గ కొన్ని మంచి పనులను ఇక్కడ చూద్దాం: తొలి అడుగు ఇంటి నుంచి వేయండి. మీ ఫ్యామిలీ మ్యాప్ అంటే కుటుంబ వృక్షాన్ని తయారు చేయండి. అందుకు మీ తాతయ్య, బామ్మ లేదా ఇంట్లో అందరికన్నా పెద్దవారి దగ్గరికి వెళ్ళి కూర్చోండి. వాళ్ళ తండ్రి తాత ముత్తాతల పేర్లు, వాళ్ళ భార్యాపిల్లల పేర్లు అడిగి తెలుసుకుని రాసుకోండి. ఈ తరం వారి పేర్లను కలపండి. ఇలా చేయడం వల్ల మీ కుటుంబ చరిత్ర మీకు తెలియ వస్తుంది. అంతేకాదు. ఆ వివరాలు చెబుతున్నప్పుడు మీ పెద్దల ముఖంలో పొంగే ఆనందానికి అవధులు ఉండవు!

తరవాత మీ ఊళ్ళో లేదా ప్రాంతంలో ఇరుగుపొరుగు మిత్రులతో కలిసి జట్లుగా ఏర్పడి పరిసరాల పరిశుభ్రతను చేపట్టండి. ఆ పనులు చేసే వాళ్ళ సమస్యలను అడిగి తెలుసుకుని పై అధికారులకు, పెద్దల దృష్టికి తీసుకువెళ్ళి పరిష్కరించడానికి ప్రయత్నించండి. ఎక్కువ పరిశుభ్రతా చర్యలు చేపట్టిన జట్టుకు బహుమతులు అందజేయండి!

ఇక దేశానికి వద్దాం. మన దేశంలో సార్వత్రిక ఎన్నికలు జరుగనున్న తరుణం ఇది. రోజు తప్పకుండా వార్తాపత్రికలు చదవండి. ఎవరెవరు ఎలాంటి వాగ్దానాలు గుప్పిస్తున్నారో గమనించండి. లోక్‌సభ ఏర్పడడాన్నీ, గెలుపొంది ప్రభుత్వం ఏర్పాటు చేసే వారినీ జాగ్రత్తగా పరిశీలించి చూడండి. ఇలా చేయడం వల్ల రాజకీయ అవగాహన పెరుగుతుంది. సామాజిక స్పృహ, సమస్యల పట్ల సదవగాహన పెంచుకున్న పిల్లలే ఉత్తమ పౌరులుగా పెరిగే అవకాశం ఉంటుంది!

రెండు నెలలు ఆడుతూ పాడుతూ ఇలాంటి ఉపయుక్తమైన పనులు చేస్తే సెలవులు హాయిగా గడిచిపోతాయి. నూతన విద్యాసంవత్సరంలో పై తరగతికి వెళ్ళే మీరు, మరింత పరిణతి చెందిన మెరుగైన వ్యక్తిగా విద్యాలయంలో అడుగుపెడతారు! అంతకు మించి ఏం కావాలి? కదలండి మరి!

సంపాదకుడు : ఎల్. సుబ్రమణ్యాన్





**Founded by**
**B. Nagi Reddi and Chakrapani**

*Chairman :* B. Viswanatha Reddi (Viswam)
*Editor & Publisher :* L. Subramanyan
*Consultant Editor :* K. Ramakrishnan
*Associate Editor :* A.R. Balasubramanyam
*Senior Artists:* K.C. Sivasankaran (Sankar), Gandhi Ayya, P. Mahesh
*Artist :* Jayapandian
*Asst. Editor-Copy & Pre-Production :* R. Sudha
*Creative Writer :* R. Vaasugi
*Layout Designer :* B.A. Hemalata Malini

*CIRCULATION TEAM :*
*Chennai :* T N Ravi Shankar, *National Sales Manager*, Mobile +91 99620 70014
email : ravishankar.tn@chandamama.com
Fazal Khan, *Manager-Circulation & Institutional Sales - South*, Mobile +91 99625 67860
email : fazal.khan@chandamama.com
*Mumbai :* Rajendra K Jadhav, *Asst. Manager-Circulation*, Mobile +91 9320565048
**CHANDAMAMA INDIA LTD.,**
B-3, Lunic Industry, Opp. State Bank of India, Near Police Station Cross Road, No.6, MIDC Andheri (East), Mumbai-400093
Phone +91 22 28312872 / 28311849
email : rajendra.jadhav@chandamama.com
*New Delhi :* Sushil Sharma, *Circulation Manager-North*, Mobile +91 99110 91022
**CHANDAMAMA INDIA LTD.,**
Goyal Business Centre, C-23/2 First floor, Connaught Place, New Delhi-110001
*Bangalore :* P. Murali, *Asst. Circulation Manager -Karnataka*, Mobile +91 94488 36952
**CHANDAMAMA INDIA LTD.,** 18, 10th Cross, Mayura Street, Papanna Lay Out, Outer Ring Road, RMV 2nd Stage, Bangalore-560094,
Phone +91 80 6655 1000
email:murali.p@chandamama.com
*Kolkata :* Ananth Prakash, *Circulation Manager-East,* Mobile +91 98362 82202, 98351 82202
**CHANDAMAMA INDIA LTD.,**
2, Decers Lane, Opp. S.K. Automobile, Kolkata- 700069. West Bengal.
email : ananth.prakash@chandamama.com
*Ahmedabad :* Kalpesh Raval, *Sales Officer-Circulation* Mobile +91 98245 19946
email : kalpesh.raval@chandamama.com
*Content Head - Online :* Sowmya Bharadwaj
email : sowmya.b@chandamama.com
*Head - Business Development :* Surajit Agarwal
email : surajit@chandamama.com
*Advertisement :*
email : sales@chandamama.com
*Subscription Queries:* L Govindasamy
e-mail : govindaswamy.l@chandamama.com
*Customer Cell :* A B Sairam
Mobile: +91 9841983774
e-mail : sairam.ab@chandamama.com
*Production Executive :* Panchakshari R Math
*Head Office :* **CHANDAMAMA INDIA LTD.,**
2/513 (Old 3/396), Sundeep Avenue East, 2nd Main Road, Chinna Neelankarai, Chennai - 600 041 Phone +91 44 43992828, Fax +91 44 43992829
Email : chandamama@chandamama.com
Website : www.chandamama.com




# పాఠకుల లేఖలు



ఓటు హక్కు వినియోగించుకోవడం ప్రతి పౌరుడి ప్రాథమిక బాధ్యత అనడం బావుంది. మనమే మనల్ని ఉద్ధరించుకోవాలి. జీమూతవాహనుడి పరోపకార బుద్ధి ఈనాటి మానవులకు సైతం ఆదర్శం. నందాదేవి పూలలోయ చాలా అద్భుతం. చందమామ 'గుడినుడి' ప్రారంభించండి.

– వాస్తు రామచంద్ర, నెల్లూరు

నాలుగు సంవత్సరాల నుంచి మేము చందమామ పుస్తకాన్ని కొనుచున్నాం. మా పిల్లల చేత తప్పకుండా చదివిస్తాం. 1980–90ల మధ్య ప్రచురితమైన కథలు వీలైతే మళ్ళీ ప్రచురించవలసిందిగా కోరుతున్నాను. నా చిన్నప్పుడు ఆ కథలు చదివాను. మా పిల్లలకు కూడా అలాంటి మంచి కథలు చెప్పి, నేను మళ్ళీ మళ్ళీ చదవాలని ఆశపడుతున్నాను.

– శ్రీలక్ష్మి, హైదరాబాదు

అందరికీ అక్షరాస్యత ప్రసాదించమని దేవుణ్ణి ప్రార్థిస్తున్నాను. ''నాక్కొంచెం అక్షరాస్యతనివ్వు, చందమామ కథలన్నీ చదివేస్తాను. నాక్కొంచెం జ్ఞానాన్ని అందిస్తే కథలన్నీ నేనే రాసేస్తాను.'' ఇదే నా ప్రార్థన.

– పులిజాల రవీందర్ రావు, హైదరాబాదు

దురాశ వివేకాన్ని మింగేస్తుందనీ, మోసపోయే వాళ్ళు ఉన్నంత కాలం మోసగాళ్ళకు తక్కువ ఉండదన్న వాస్తవాన్నీ 'న్యాయ నిర్ణయం' కథ చక్కగా వివరించింది. ఎదుటి వారిని అపార్థం చేసుకోకుండా అర్థం చేసుకోవడానికి ప్రయత్నించడం వల్లే మానవ సంబంధాలు మరింత మెరుగుపడతాయని చెప్పిన 'అర్థం–అపార్థం' కథ సందేశాత్మకంగా ఉంది.

–రావులపాటి ప్రసాద్, మచిలీపట్నం(ఆం.ప్ర.)

మీ అభిప్రాయాలను ఈమెయిల్ feedback@chandamama.com ద్వారా, SMS MLANG <TEL your feedback> 54646 ద్వారా పంపవచ్చు.





# రామయ్య మిఠాయి వ్యాపారం

సీతాపురం గ్రామ కూడలిలో రామయ్య, సోమయ్యలు బెల్లం మిఠాయి అమ్ముతూండే వారు. వాళ్ళ మిఠాయికి ఊళ్ళోనే కాక, చుట్టు పక్కల గ్రామాల్లోనూ మంచి పేరున్నది. ఇద్దరూ మంచి మిత్రులే గాని, మన స్తత్వంలో మాత్రం కొద్దిగా తేడా కనిపించేది. రామయ్య పేదసాదలను కాస్త చూసి అమ్మే వాడు. పిల్లలయితే కొసరెక్కువ పెడతాడని అతడి కొట్టుకే పరిగెత్తేవాళ్ళు. సోమయ్య దీనికి పూర్తిగా విరుద్ధం. లాభం మీదే దృష్టి. తక్కిన విషయాలు అంతగా పట్టించుకునే వాడు కాడు.

ఒకసారి పండగ సందర్భంగా రామయ్య తన కొట్టులో తాజా మిఠాయి సిద్ధం చేసి పెట్టాడు. ఏవో కారణాల వల్ల సోమయ్య ఆ రోజు కొద్దిపాటి సరుకుతో అంగట్లో కూర్చోవలసి వచ్చింది. అంతలో అటుగా వస్తూన్న శరభయ్యను చూసి సోమయ్య ఒక్క క్షణం కంగారు పడ్డాడు. శరభయ్య పక్క ఊరి పెద్ద రైతు. సీతాపురం వచ్చాడంటే తప్పకుండా పెద్ద మొత్తంలో మిఠాయి కొని పట్టుకు వెళతాడు.

శరభయ్య వచ్చీ రాగానే తమ ఇంట్లో జరిగే శుభకార్యానికి ఎక్కువగా మిఠాయి కావాలన్నాడు. టోకు బేరం చేజారి పోయినందుకు సోమయ్య మనసులో తనను తాను నిందించుకుంటూ, ''క్షమించండి. అంత మిఠాయి లేదు. ఈ సారికి రామయ్య కొట్లో కొనుక్కోండి,'' అని చెప్పి తనే అతణ్ణి రామయ్య కొట్టుకు వెంటబెట్టుకుని వెళ్ళాడు.

కొట్టును సమీపిస్తూ, ''రామయ్యా, పొరుగూరి శరభయ్యగారు వచ్చారు. అదృష్టం అంటే నీదే. ఈ రోజు నీ పంట పండింది,'' అన్నాడు సోమయ్య.

స[illegible]రెడ్డి త్రివిక్రమరావు



‘‘మొత్తం మిఠాయి మూట కట్టు,’’ అంటూ శరభయ్య సంచీలోంచి డబ్బు పైకి తీయబోయాడు.

‘‘అంగట్లో సరుకంతా మీకు ఒక్కరికే అమ్మేస్తే, నా వద్ద రోజూ వచ్చి కొనుక్కునే వారికి ఇబ్బంది కదా?’’ అన్నాడు రామయ్య.

‘‘నువ్వు వ్యాపారివి. ఎవరికి అమ్మితే ఏం, నీ డబ్బు నీకు ముట్టుతున్నప్పుడు?’’ అని అన్నాడు శరభయ్య.

‘‘పండుగ పూట. పేదా సాదా వస్తారు మిఠాయి కోసం. వాళ్ళను నిరాశపరచలేను. కావాలంటే మీరు ఇంతగా అడుగుతున్నారు గనక, ఐదు వీశెలు ఇస్తాను. తీసుకెళ్ళండి,’’ అన్నాడు రామయ్య.

శరభయ్య ముఖం చిట్లించి, ‘‘ఇదిగో నీ సరక్కు రెండింతలు ధర ఇస్తున్నాను. ఇక మాట్లాడకుండా మొత్తం ఇవ్వు,’’ అన్నాడు ఆజ్ఞాపిస్తున్నట్టు.

‘‘క్షమించండి. మీరు ఎంత ఇచ్చినా మొత్తం సరుకు మీ ఒక్కరికే అమ్మలేను,’’ అని చెప్పి, రామయ్య తనవ్యాపారం చూసు కోసాగాడు.

‘‘నే నెవరినో తెలుసా? మీ గ్రామాధికారికి చాలా కావలసిన వాణ్ణి’’ అని హెచ్చరించాడు శరభయ్య.

సోమయ్య కూడా రామయ్యను ఒప్పించే ప్రయత్నం చేయబోయాడు. అయితే, వారి ఊళ్ళోవాళ్ళకు లేకుండా చేసి లాభం కోసం మొత్తం ఒక్కరికే అమ్మడానికి రామయ్య ఒప్పుకోలేదు.

అవమానంతో కుతకుతలాడి పోయాడు శరభయ్య. అంతలో దూరంగా గ్రామాధికారి

కనిపించడంతో కేక వేసి పిలిచి, ఆయన దగ్గరికి రాగానే, ''చూశారా ఈ రామయ్యకు ఎంత తలబిరుసో,'' అని అంటూ గడగడా విషయం చెప్పి, ''మీరన్నా ఒప్పించండి,'' అన్నాడు.

''ఏం రామయ్యా, శరభయ్య గారికి మిఠాయి అమ్మలేవా? '' అని అడిగాడు గ్రామాధికారి.

రామయ్య తన అభిప్రాయాన్ని వినయంగా చెబుతూండగా, ''తాతయ్యా, జిలేబీ,'' అంటూ ఇద్దరు కుర్రాళ్ళు పరుగెత్తుకు వచ్చి రామయ్య చేతిలో డబ్బులు ఉంచారు.

రామయ్య జిలేబీ పొట్లం కట్టి, ''ఇందాక సరుకంతా ఆ పెద్దమనిషికే అమ్మేసి ఉంటే, ఇప్పుడు ఈ పిల్లలకు మిఠాయి ఇవ్వగలనా?'' అంటూ పొట్లాలను పిల్లలకు ఇచ్చాడు.

''శరభయ్య ఉన్నవారు. కావాలంటే పట్నం వెళ్ళి కొనుక్కోగలరు. పండగ పూట మన ఊరి పిల్లలు ఎక్కడికి పోతారు,'' అన్నాడు రామయ్య మళ్ళీ.

శరభయ్య, ''ఈ పొగరుబోతు ఇస్తానన్నా నాకు వద్దు. ఇతడి మిఠాయి ఎవడిక్కావాలి? నేను పట్నం వెళ్ళి కొనుక్కుంటాను,'' అంటూ అక్కడినుంచి విసురుగా వెళ్ళిపోయాడు.

పిల్లలు అతడిచ్చిన కొసరు మిఠాయిని అక్కడే లొట్టలువేస్తూ తినసాగారు.

వాళ్ళ కేసి సంతోషంగా చూసిన గ్రామాధికారి, రామయ్య వ్యాపార ధర్మాన్ని మనసులోనే మెచ్చుకున్నాడు.చేసేది చిన్న వ్యాపారమే అయినా, అది అందరికీ ఉపయోగపడాలి; తన ఒక్కడికి మాత్రం లాభం వస్తే చాలదు అని ఆలోచించే అతడి దొడ్డ బుద్ధికి ఎంతో సంతోషించాడు.

''అన్నట్టు మరిచాను, రామయ్యా! నేను వచ్చిందే మా పిల్లలకు మిఠాయి కోసమని. నాకూ ఒక వీశె ఇవ్వు. శరభయ్యకు మొత్తం అమ్మేసి ఉంటే నాకూ లేకుండా పోయి ఉండేది,''అంటూ మిఠాయి కొనుక్కొని వెళ్ళాడు.

సోమయ్య మిత్రుణ్ణి ఆప్యాయంగా చూస్తూ ఉండిపోయారు.



# సహాయనిధి!

అకాల వర్షాలతో అతలాకుతలమైన గ్రామస్థులను ఆదుకోవడానికి జమీందారు రంగభూపతి నిధులను పంపాడు. నిధులను అందుకున్న ప్రజలందరూ సంతోషించారు గానీ, రాయవరం గ్రామస్థులకు మాత్రం అసలు సహాయం అందలేదని తెలియవచ్చింది. సంగతేమిటో తెలుసుకుందామని జమీందారు స్వయంగా దివానును వెంటబెట్టుకుని గుర్రబ్బండిలో రాయవరం బయలుదేరాడు.

ఆయన వెళ్లిన సమయానికి గ్రామంలో చాలా మంది కూలిపోయిన ఇళ్ళను బాగు చేయడంలో నిమగ్నులై ఉన్నారు. వాళ్ళతో కలిసి పనిచేస్తున్న రవిచంద్రుడనే యువకుణ్ణి దగ్గరికి పిలిచి, ''బాధితులకు అందజేయమని పంపిన ధనధాన్యాలను ఇంట్లో దాచుకుని, కాలే కడుపులతో వాళ్ళ చేత పనులు చేయిస్తున్నావేమిటి?'' అని నిలదీశాడు జమీందారు కోపంగా.

''ప్రభువులు క్షమించాలి. రెండు వందల గడప ఉన్న మా గ్రామంలో గాలివానకు యాభై ఇళ్ళు నేలమట్టమయ్యాయి. వాటిని వెంటనే నిర్మించుకోవడం మామూలు కుటుంబస్థులకు సాధ్యమయ్యే పనికాదు. అందువల్ల పనిచేయగల వాళ్ళచేత ఇళ్ళు బాగు చేయించే పనులు చేయిస్తున్నాను. సాయంకాలానికి వాళ్ళ శ్రమకు తగ్గ ఫలితాన్ని తమరు పంపిన నిధి నుంచి తీసి ఇస్తున్నాను. ఇలా చేయడం వల్ల త్వరలోనే ఇళ్ళు తయారు కావడంతో పాటు, గ్రామస్థుల మధ్య సంఘీభావం పెరగగలదని ఆశిస్తున్నాను. ఊరక అందే సాయం వల్ల అలసత్వం, సోమరితనం పెరగడం తప్ప శాశ్వత ప్రయోజనాలేవీ ఒరగవు కదా?'' అన్నాడు రవిచంద్రుడు వినయంగా.

జమీందారు నవ్వుతూ, ''పసివాడివైనా విద్యావంతుడి వనిపించుకున్నావు. మనసారా అభినందిస్తున్నాను,'' అంటూ మెడలోని ముత్యాల హారాన్ని తీసి అందించి తృప్తిగా అక్కడి నుంచి బయలుదేరాడు.

– వెంకటేష్



# నవతరం పిల్లల వాణి
# చందమామ @
# chandamama.com\telugu

పాత కొత్తల మేలుకలయికగా చందమామ ఆన్‌లైన్ ఎడిషన్ @
chandamama.com\telugu



## ఆన్‌లైన్ ఎడిషన్ ఛానళ్లు

పురాణాలు, సమకాలీన అంశాలు, కామిక్స్, కథలు, పోటీలు, షాపింగ్, ఆర్కైవ్స్ మొదలైన ఛానళ్లు మీ కోసమే...





## అలనాటి కథలకు నిలయం

చందమామ.కామ్/తెలుగు సర్ఫ్ చేయండి. వందలాది కథలను, కామిక్స్‌ను చూడండి. అలనాటి పౌరాణిక, ఐతిహాసిక, జానపద కథలు, చందమామ హీరోలను వీక్షించండి... ఇంటర్నెట్ చూసే పిల్లలకు, పెద్దలకు కూడా విజ్ఞాన, వినోదభరిత వెబ్‌సైట్.



## సమకాలీన అంశాలు

హాస్యం, జీవిత చరిత్రలు, వార్తలు, చరిత్రలో ఈ రోజు, లోకజ్ఞానం, క్రీడలు, విజ్ఞాన శాస్త్రం, వైద్యం వంటి సమకాలీన అంశాలకు చోటు.





## చందమామ రచయిత కావాలని ఉందా?

chandama.com\telugu లోకి వచ్చి మీ స్వంత రచనలు, కథలు, అనుభవాలు, చెణుకులు, పెయింటింగ్స్, చిత్రాలు, ఘటనలను పోస్టింగ్ చేయండి.





## ఇంకా మరెన్నో...

బ్లాగులు, తెలుగు నీతి పద్యాలు, జాతీయాలు, సూక్తులు, పాత సినీ గీతాలు, క్విజ్, పజిల్స్, జానపద గీతాలు, లోకజ్ఞానం, జంతు ప్రపంచం, పిల్లల జ్ఞాపకాలు, తరగతిగది ముచ్చట్లు, చిత్రాలు ఆరోగ్య చిట్కాలు, కథనాలు, పుస్తక పరిచయాలు, మరెన్నో... చూడవచ్చు.





# వేగ సూత్రం



అంకెలతో ఆడుకునే స్వభావం కలవారా మీరు?

అంకెల గారడీ చూసి ఆనందిస్తారా? అలా అయితే ఈ పేజీ మీ కోసమే!

వేదగణితం పదహారు సూత్రాలు కలిగిన ప్రాచీన విధానం. జటిలంగా కనిపించే లెక్కల సమస్యలను అది అతి సరళం, సులభం చేస్తుంది. బుర్రబద్దలు కొట్టుకోకుండా లెక్కలను సునాయాసంగా చేసే చిట్కాలను, దగ్గరి దారులను ఈ సూత్రాలు తెలియజేస్తాయి.

5X5=25, మరి 95X95=? కాలిక్యులేటర్ కోసం వెతక్కండి. 5 అంకెతో పూర్తయ్యే అంకె వర్గం, కనుగొనాలంటే ఈ పద్ధతిని అనుసరించండి. సమాధానం చిటికెలో వచ్చేస్తుంది.

స్టెప్ 1: 5X5 గుణించగా వచ్చే 25 ను కుడివైపున రాసుకోండి.

స్టెప్ 2: 5 కన్నా భిన్నంగా ఉన్న దాని ముందు అంకెకు, ఒక అంకె కలిపి దాన్ని గుణించండి. పైన ఇచ్చిన 95లో 5 తీసేస్తే 9 కదా. దానికి ఒకటి కలిపితే 10 వస్తుంది. కాబట్టి 9ని 10తో గుణించండి. వచ్చే 90ని మీ సమాధానంలో ఉన్న అంకెకు ఎడమ వైపున రాయండి. ఇప్పుడు మీ సమాధానం 9025.

ఇప్పుడు కంప్యూటర్ తీసుకుని సరిచూసుకోండి.

ఆహా! సరైన సమాధానం! అద్భుతం కదూ!

ఇదిగో ఇప్పుడు ఈ నెల ప్రశ్న:

రోషన్, మహేష్ ఒక జంతు పరిరక్షణశాలలో చేరారు. మూడు నెలల పాటు సెప్టెంబర్, అక్టోబర్, నవంబర్‌నెలలు 63 పిల్లులకు, 23 కుక్కలకు ఆహారం అందించే పనివాళ్ళకు అప్పగించబడింది. ఒక రోజుకు ఒక జంతువుకు రూ. 10లు ఖర్చవుతాయి. మూడు నెలలకయ్యే ఖర్చును కనుగొనడానికి వేగవంతమైన దగ్గరి మార్గం ఏది?

మీ వేగ సూత్రాన్ని మాకు పంపండి?

అత్యంత వేగవంతమైన సూత్రానికి బహుమతి రూ.500లు!

మీ ఎంట్రీలను పంపవలసిన చిరునామా:

ఎడిటర్, చందమామ ఇండియా లిమిటెడ్, 2/513, సందీప్ అవెన్యూ ఈస్ట్, సెకండ్ మెయిన్ రోడ్, చిన్న నీలాంగరై, చెన్నయ్-600041.

లేదా contests@chandamama.com కు ఈ మెయిల్‌చేయండి.

**గమనిక:** ఈ సమస్యకు సంబంధించిన వేద గణిత సూత్రం జూన్ సంచికలో ప్రకటించబడుతుంది.



# పాతాళదుర్గం

## 9

*(సైనికదుస్తులు ధరించి ధూమక సోమకులు, కాంతిసేనను వెతుకుతూ కొంతదూరం వెళ్ళి, ఒక సెలయేటి దగ్గిర దాహం తీర్చుకునేంతలో, ఆటవికులు వాళ్ళను చుట్టు ముట్టి పట్టుకున్నారు. కొంత సేపటికి అక్కడికి వచ్చిన వాళ్ళ నాయకుడు విరూపు డనేవాడు వాళ్ళను బల్లెంతో పొడవ బోయినవాడల్లా, 'దొరబాబులూ!' అంటూ వాళ్ళకు సాష్టాంగపడిపోయాడు. -తరవాత)*

ధూమక సోమకులు ఒక క్షణకాలం నిశ్చేష్టులయ్యారు. విరూపుడి ప్రవర్తన వాళ్ళకు చాలా వింతగా కనబడింది.

విరూపుడు లేచి నిలబడి, ''కాలశంబర మాంత్రికదొర మిత్రులైన మీరు, మాకు ప్రభుసమానులు. తెలియక చేసిన మా తప్పులు మన్నించండి,'' అన్నాడు.

'మేము కాలశంబరుడి మిత్రులం కాదు, శత్రువులం!'' అంటూ సోమకుడు కళ్ళెర్ర చేసి పళ్ళుకొరుకుతూ కింద పడివున్న కత్తిని చేతికి తీసుకోబోయేంతలో, ధూమకుడు అతణ్ణి వారించి, ''విరూపా! మేము మాంత్రికుడి మిత్రులం అని నువ్వెలా గ్రహించగలిగావు?'' అని అడిగాడు.

విరూపుడు, ధూమకుడి నడుం నుంచి వేలాడుతున్న మంత్రదండాన్ని తన వేలితో చూపుతూ, ''మాంత్రికదొర ఈ ఉదయమే, మా గూడెంలో కొంచెం సేపు విశ్రాంతి

'చందమామ'



తీసుకుని వెళ్ళాడు. తన మంత్రదండం వెంట తెచ్చిన వారిని ఆదరించి సహాయం చేయమనీ, అది వెంటలేని సైనికుల్ని గాని, పట్టణవాసుల్నిగాని ఒక్క అడుగైనా అరణ్యంలో ముందుకు రాకుండా హతమార్చమనీ ఆజ్ఞాపించాడు,'' అన్నాడు.

ఈ మాటలతో ధూమకుడికి ఆనందం, మాంత్రికుడి ఎత్తుగడ ఏమిటో అర్థంకాక భయమూ కూడా కలిగింది.

''మేం కాలశంబరుడి నివాసస్థానానికి పోతున్నాం. ఆయనకు ఒకానొక రాక్షసుడు – కుంభీరు డనేవాడు పరమశత్రువు. వాడు నివసించే చోటు నీకు తెలుసా? అంతేకాక కాలశంబర మాంత్రికుడు ఈ రాత్రికి ఎక్కడ మజిలీ చేయబోతున్నాడు?'' అని ప్రశ్నించాడు ధూమకుడు.

''మాంత్రికదొర ఈ మహారణ్యంలో ఏ మార్గాన ప్రయాణం చేసేది నాక్కూడా తెలియదు. అదంతా పరమరహస్యం కాని, ఆ దొర నివసించే చోటు మీకూ తెలుసుకదా? దండకారణ్యంలో మహాకలి రాక్షసుడుండే పాతాళదుర్గ ప్రాంతాల. అక్కడికి మీతోపాటు కొంత దూరం వచ్చి, దారి చూపించగలను,'' అన్నాడు విరూపుడు.

''ఎవడీ మహాకలి రాక్షసుడు?'' అనుకున్నాడు ధూమకుడు. సోమకుడు కళ్ళింత చేసుకుని అత్యాశ్చర్యంతో విరూపుణ్ణి ఏదో ప్రశ్నించబోయే సరికి, ధూమకుడు అతడి మాటలకు అడ్డంవచ్చి, ''విరూపా! నువ్వు చేస్తానన్న సహాయానికి మేం ఇద్దరం చాలా కృతజ్ఞులం. ముందు భోజనం చేసి, తరవాత ప్రయాణం సాగిద్దాం,'' అన్నాడు.

భోజనం అన్న మాట వింటూనే, విరూపుడు తన అనుచరుల కేసి తిరిగి, ''అందరూ ఇక్కడ నిలబడి వింత చూస్తున్నారా, లేక కొందరైనా పోయి, ఈ దొరలకు భోజనం ఏర్పాట్లు చేస్తున్నారా?'' అని గద్దిస్తూ ప్రశ్నించాడు.

''ఆ ఏర్పాట్లన్నీ పూర్తి కావచ్చినై, దొరా! అంతా భోజనాలకు రావచ్చు,'' అన్నాడొక యువ ఆటవికుడు.

ధూమకసోమకులకు, విరూపుడు రాజోచితమైన విందు చేశాడు. రకరకాలైన మాంసాలూ, అడవిఫలాలూ, తేనే సమృద్ధిగావున్నాయి. బాగా ఆకలిగొనివున్న ధూమక సోమకులు తృప్తిదీరా భుజించారు. తరవాత అతిథుల

వినోదం కోసం ఆటవిక యువతీయువకులు రకరకాల కర్రా, కత్తీ సాములూ, మల్ల యుద్ధాలూ జరిగినై.

ధూమకసోమకులు తమ అదృష్టానికి ఎంతో ఆనందపడ్డారు. ఎంతో కష్టసాధ్య మనుకున్న పని, వాళ్ళకా క్షణంలో చాలా తేలిక అనిపించింది. ముందు కాలశంబర మాంత్రికుణ్ణి కలుసుకోవటం, అతడి ద్వారా కుంభీరుణ్ణి వెతికిపట్టుకుని వాడి చెరనుంచి కాంతిసేనను విముక్తి చేయటం–ఇదంతా సులభంగా జరిగిపోయే కార్యంలా తోచింది వాళ్ళకు. కాని, ధూమకుణ్ణి ఆవగింజంత సంశయం బాధిస్తూనే వున్నది. కాలశంబరుడు తన మంత్రదండం కోసం, ఏదో యుక్తిపన్ని తమను హతమార్చ చూస్తున్నాడా?

ఏది ఏమైనా, ఎన్ని ఘోర ప్రమాదాలను ఎదుర్కో వలసివచ్చినా, తాము రాకుమారి కాంతి సేనను రాక్షసుడి బారి నుంచి కాపాడక తప్పదు. ఇలాంటి దృఢనిశ్చయానికి వచ్చిన ధూమకుడు విందు ముగిసిన తరవాత కొద్దిసేపు విశ్రాంతి తీసుకుని, తిరిగి ప్రయాణం సాగించాడు. ఈ సారి ధూమక సోమకులకు తోడుగా విరూపుడు కూడా బయలుదేరాడు బల్లెంతో పాటు, పొడవాటి తాడొకటి భుజానికి చుట్టచుట్టి తగిలించుకున్నాడు.

ముగ్గురూ అరణ్యంలో ఒక గంటకాలం ప్రయాణించి ఒక కొండ ప్రాంతం చేరారు. కొండ పాదాన్ని ఒరుసుకుంటూ నది ఒకటి ప్రవహిస్తున్నది. ముగ్గురూ దాన్ని దాట వలసివున్నది. ముందు నడుస్తున్న విరూపుడు




నదిని సమీపించి, ఆశ్చర్యంగా ఒక చిన్న కేక పెట్టి, వెనక గుర్రాల మీద వస్తున్న ధూమక సోమకులను పిలిచాడు. ధూమక సోమకులు గుర్రాలు దిగి, విరూపుణ్ణిసమీపించి, అక్కడ ఎదురైన దృశ్యం చూసి వింతపడ్డారు.

నదీతీరంలో ఏదో భయంకర పోరాటం జరిగిన దాని గుర్తుగా, విరిగిన ఈటెలూ, బాణాలూ, నేలమీద రక్తపుమరకలూ కనిపిస్తున్నవి. నదీతీర మంతా ఆ పోరాడిన వారెవరో కాళ్ళతో మట్టగించి, కలయ తొక్కారు. విరూపుడు అదంతా ధూమక సోమకులకు చూపుతూ, ''ఈ ప్రాంతాల నివసించేవాళ్ళు మా జాతివాళ్ళు కాదు, భిల్లులు. వాళ్ళతో మాకు శత్రుత్వం లేక పోయినా, స్నేహం మాత్రం లేదు. ఇక్కడ ఇంత రక్తపాతానికి కారకులెవరో తెలియటం లేదు. కొంచెం నది

దిగువకు వెళ్ళి వస్తాను, మీ రిక్కడే వుండండి,'' అంటూ తీరంవెంట ముందుకు వెళ్ళాడు.

ఆ ప్రాంతానా విరూపుడికి కొన్ని కాలి గుర్తులు కనిపించినై. హఠాత్తుగా అతడికి కాలశంబరుడు గుర్తుకొచ్చాడు. ఆయన కేమైనా హాని జరిగిందా? అనుకుంటూ విరూపుడు అతడి పావుకోళ్ళ గుర్తు లేమైనా కనబడతవేమో అని నేల మీదికి వంగి చూసేం తలో, జుయ్‌మంటూ ఈటె ఒకటి అతడి తలను రాసుకుంటూపోయి, ఒక అడుగు దూరంలో నేలలో బలంగా గుచ్చుకున్నది.

విరూపుడు ఒక్క ఊపున లేచి నిలబడి వెనక్కు తిరిగి చూసేంతలో మరొక ఈటె అతడి గుండెల మీదికి మెరుపులా దూసుకు రాసాగింది అతడు చప్పున పక్కకు పడి పోయాడు. ఈటె నదిలో బుడుంగు మంటూ పడిపోయింది. విరూపుడు లేవ బోయేం తలో, ''రాక్షసబంటూ, దొరికావు! నీ పేగులు తీసి మెడలో వేసుకుంటాను,'' అంటూ ఒక మహాకాయుడైన భిల్లుడు అతడి మీదికి ఎనుబోతులా వచ్చి పడ్డాడు.

విరూపుడు ఈ దాడికి సిద్ధంగా లేకపోవ టంతో భిల్లు డతణ్ణి నడుం పట్టుకుని ఒక్క విసురు విసిరేసరికి నీటి ఒడ్డుకు వెళ్ళి పడ్డాడు. మరుక్షణంలోనే భిల్లుడు అతడి గుండెల మీద కూర్చుని, తన బలమైన చేతులతో విరూపుడి కంఠం బిగించి పట్టుకున్నాడు. ఆ సరికి విరూపుడు తెప్పరిల్లి, కాళ్ళతో భిల్లుడి మెడను అడకత్తెరలో బిగించినట్టు బిగించి, బలంగా ఒక్క తోపు తోశాడు. భిల్లుడు కాస్త వెళ్ళి నదీజలంలో పడ్డాడు. వాడు నీటి నుంచి లేవక ముందే విరూపుడు పులిలా వెళ్ళి





మీదపడి, అతడి తలను నీటిలో అదిమి పట్టుకున్నాడు. ఊపిరాడక భిల్లుడు గిలగిల కొట్టుకుంటూ, తల నీటిపైకి వచ్చినప్పుడల్లా, ''విరూపా, నన్ను చంపకు. నేను పులిందుణ్ణి!'' అంటూ అరవసాగాడు.

ధూమకసోమకులు ఈ అరుపులు విని అక్కడికి పరిగెత్తుకు వచ్చారు. వాళ్ళు వచ్చే సరికి విరూపుడు, భిల్లుణ్ణి నీటిలో నుంచి కాళ్ళు పట్టుకుని ఒడ్డుకు ఈడ్చు కొస్తున్నాడు. ధూమకుడది చూసి, ''ఏం జరిగింది?'' అని ప్రశ్నించాడు.

''వీడు నన్ను దొంగచాటుగా చంపాలని చూశాడు. తగిన శాస్తి చే[illegible]. వీడు చెప్పే పేరు నిజమైతే, వీడు భిల్లుల నాయకుడు!'' అన్నాడు విరూపుడు.

ధూమకసోమకులు భిల్లుణ్ణి సమీపించి, ''ఎవడివి నువ్వు? విరూపుణ్ణి ఎందుకు చంపాలని చూశావు?'' అని ప్రశ్నించారు.

భిల్లుడు బొళక్కుమంటూ ఇన్ని నీళ్ళు కక్కి ఆయాసపడుతూ, ''రాజభటులు నాకు న్యాయం కలిగించాలి! నా పేరు పులిందుడు, భిల్లనాయకుణ్ణి. ఇంతకు ఓగంట ముందు నా పడుచు పెళ్ళాన్ని ఈ విరూపుడూ మరికొందరూ కలిసి అపహరించుకుపోయారు. అడ్డొచ్చిన నా వాళ్ళను కొందరిని చంపేశారు. ఇతడూ ఇతడి పరివారం నా భార్యను ఎవడో రాక్షసుడి కోసం ఎత్తుకు పోతున్నట్టు, వాళ్ళ మాటలద్వారా బతికి బయటపడ్డ నా అనుచరులు గ్రహించి నాకు చెప్పారు,'' అన్నాడు.

పులిందుడి మాటలు విని అందరూ చాలా ఆశ్చర్యపడ్డారు. ధూమకుడు ఏదో ప్రశ్నించబోయేంతలో విరూపుడు, పులిందుణ్ణి సమీపించి, ''నీ భార్యను అపహరించుకుపోయిన వాళ్ళల్లో నేనున్నట్టు నీ అనుచరులు చూశారా? ఛీ, అబద్ధాలాడకు, ఈ బల్లెంతో పేగులు తోడగలను,'' అంటూ బల్లెం ఎత్తాడు.

ధూమకుడు, విరూపుడి చేయి పట్టుకుని ఆపి, ''పులిందా! నువ్వేదో పొరబడుతున్నావ్. విరూపుడు గత అయిదారు గంటలుగా మాతోనే వున్నాడు. నువ్వేదో రాక్షసుడన్నావే–వాడి ముఠావాళ్ళు విరూపుణ్ణి అపఖ్యాతి పాలు చేసేందుకు, అతడి పేరు చెప్పి వుంటారు. అంతేకాక, మీ రెండు తెగల మధ్యా శత్రుత్వం రెచ్చకొట్టటం కూడా వాళ్ళ ఉద్దేశం అయివుంటుంది. నువ్వు చెప్పే రాక్షసు డెవరో మాకు

తెలుసు. ఆ దుర్మార్గుణ్ణి హతమార్చటానికే మేము బయలుదేరాం. నీ భార్యను కూడా తప్పక వాడి చెరనుంచి విడిపించుకు వస్తాం,'' అన్నాడు.

ధూమకుడిలా అనే సరికి పులిందుడు తన పొరపాటు గ్రహించి, విరూపుడి దగ్గిరకు వెళ్ళి క్షమించవలసిందిగా కోరాడు. ధూమకసోమ కుల ప్రోత్సాహంతో వాళ్ళిద్దరూ పరస్పరం ఆలింగనం చేసుకుని మిత్రులయ్యారు. ఆ తరవాత ధూమకసోమకులు నది దాట కోరుతున్నారని తెలిసి పులిందుడు, ''అయ్యా, మీ రిక్కడే వుండండి. నేను మా పల్లె రేవు నుంచి రెండు తెప్పలు పంపుతాను. వాటి మీద మీరూ, మీ గుర్రాలూ క్షేమంగా నది దాట వచ్చు,'' అని చెప్పి పరుగుపరుగున తన పల్లె కేసి వెళ్ళాడు.

కొద్ది సేపటి తరవాత ఇద్దరేసి భిల్లులు రెండు తెప్పలను నదిలో తోసుకుంటూ వచ్చారు. ధూమకసోమకులు ఒక తెప్ప మీద ఎక్కారు. విరూపుడు గుర్రాలతో మరొక తెప్ప ఎక్కాడు. తెప్పలు రెంటినీ భిల్లులు తెడ్లు వేసి తోస్తూ అవతలి ఒడ్డుకు నడపసాగాడు. అవి సరిగా నది మధ్యలోవుండగా, ధూమకుడి నడుం నుంచి వేలాడుతున్న కాలశంబరుడి మంత్రదండం, చప్పున పాములా పైకి లేచి, తూర్పు దిక్కు కేసి ముఖం పెట్టి ఏవో కీచు ధ్వనులు చేయ సాగింది. ఆ వింత చూసి విరూపుడు నివ్వెరపోతూ, ఏమో అనబో యేంతలో, దాపులనున్న కొండ శిఖరం మీది నుంచి ఒక నల్లని గరుడపక్షి రివ్వుమంటూ ఆకాశంలో లేచి, బాణవేగంతో వచ్చి మంత్ర దండాన్ని పామునుకుని ఒక్క తన్నుతో గోళ్ళ మధ్య ఇరికించుకుని ఆకాశంలోకి ఎగిరింది. మంత్రదండాన్ని కట్టివుంచిన తాడు బలమైనది కావటంతో, ధూమకుడు కూడా దానితో పాటు పైకి లేచాడు. సోమకుడు ఒక్క కేక పెట్టి బాణం ఎక్కుపెట్టి కూడా, బాణం ధూమకుడికి తగలవచ్చునన్న భయంతో కొయ్యబారి పోయాడు. ఈ లోపల విరూపుడు బెదరిన గుర్రాలను సముదాయించి, ''శాంభవీ!'' అంటూ అరిచి, భుజాన్నుంచి వేలాడుతున్న తాడు ఉచ్చును, గరుడపక్షికి గురిచేసి పైకి విసిరాడు.

(ఇంకావుంది)






# మాధవి తెగువ

పట్టువదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగివెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటి లాగే మౌనంగా శ్మశానం కేసి నడవ సాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, “రాజా, నీ ధైర్య సాహసాలు మెచ్చతగినవే గాని, అవి నీ కోసమా, లేక ఇతరులపై జాలితో ప్రదర్శిస్తున్నవా అన్న అనుమానం కలుగుతున్నది. ఇతరులు సాధించలేని పనులు తాము సాధించాలన్న పట్టుదలతో కొందరు సాహస కృత్యాలకు పూనుకుంటారు. మరి కొందరు ఇతరులపై కనికరంతో దుస్సాహసాలకు సైతం వెనుకాడరు. మరీ, సున్నితమనస్కులైన స్త్రీలయితే తమ వాళ్ళ కష్టాలు చూడలేక తామే కష్టాల ఊబిలో దిగిపోతారు. కన్న వాళ్ళ కోసం తన అయిష్టతను చంపుకుని సాహస కృత్యానికి

బేతాళ కథలు




పూనుకున్న మాధవి అనే యువతి కథ చెబుతాను, శ్రమ తెలియకుండా విను,'' అంటూ ఇలా చెప్ప సాగాడు:

అంబికాపురంలోని కామినికి వీరయ్యతో వివాహమయింది. వీరయ్య మంచివాడేకాని, వాడి తల్లి మంగమ్మ పరమగయ్యాళి. ఆమె కోడలిని ఆరడిపెట్టేది. అది భరించలేని కామిని వేరుకాపురం పెడదామని భర్తను పోరింది. అయితే, ''అమ్మ బతికుండగా వేరు కాపురం మాటెత్తకు. ఎలాగో సర్దుకుపో,'' అన్నాడు వీరయ్య.

అత్త చస్తే తప్ప విమోచనం లేదనుకున్న కామిని ఒక రోజు ఆమెకిచ్చే పాలలో విషం కలిపింది. కానీ పొరబాటున ఆ పాలు తనే తాగి అకాలమరణం చెందింది. అత్త పెట్టే ఆరళ్ళు భరించలేక ఆత్మహత్య చేసుకున్నదని అందరూ జాలిపడ్డారు.

కొడుక్కు రెండోపెళ్ళి చేద్దామనుకుని మంగమ్మ ఆ ఊళ్ళోని మాధవి అనే పేద యువతిని చూసింది. పెళ్ళికి ఉభయ ఖర్చులూ భరిస్తానంటే మాధవి తల్లితండ్రులు పరమానందపడ్డారు. తల్లిదండ్రుల మాట కాదనలేని మాధవికి భవిష్యత్తు గురించి బెంగ పట్టుకున్నది. తనకు సాయపడమని జగదంబకు పూజలు ప్రారంభించింది.

ఒకనాడు మాధవి ఏటిగట్టున ఉన్న జగదంబ ఆలయానికి వెళ్ళి మొక్కుకుని వెలుపలికి వస్తూండగా, రావిచెట్టు కింద ఎర్రటి బట్టలతో, జడలు కట్టిన జుట్టుతో ఒక యోగిని కూర్చుని ఉండడం చూసింది. వింధ్య పర్వతాలలో సుదీర్ఘకాలం తపస్సు చేసి, అనేక సిద్ధులు, మహత్తులు సాధించి దేవీపీఠాల దర్శనార్థం బయలుదేరిన ఒకనాటి పూజారిణి ఆ యోగిని. ఆమెను తను రోజూ మొక్కే జగదంబ స్వరూపంగానే భావించి మాధవి తన సమస్యను సజల నయనాలతో విన్నవించుకున్నది.

యోగిని మాధవిని మందహాసంతో ఆశీర్వదించి పంపేసి, ఆమెకు సాయపడాలని కళ్ళు మూసుకుని ధ్యాననిమగ్నురాలయింది. ఆమెకు మంగమ్మ ఇంటి చుట్టూ తిరుగుతున్న కామిని ఆత్మ కనిపించింది. ఆమెను పిలిచి, ''కర్మఫలాన్ని బట్టి ఆత్మల్లో కొన్ని స్వర్గానికీ, కొన్ని నరకానికీ వెళితే, మరికొన్ని పునర్జన్మనెత్తుతాయి. నువ్వు కోరికలు తీరని ఆత్మవు కాబట్టి దెయ్యమయ్యావు. ఇప్పుడు మనుషులకూ, నీకూ పొసగదు. దెయ్యాల లోకానికి వెళదాం పద,'' అన్నది యోగిని.

‘‘నేను దెయ్యాల లోకానికిరాను. మను షుల మధ్యే ఉంటాను. నన్ను ఆరళ్ళు పెట్టిన అత్తను ఇంటి నుంచి తరిమే వరకు నాకు శాంతి ఉండదు. అందుకు ఏదైనా ఉపాయం ఉంటే చెప్పు,’’ అన్నది కామిని దెయ్యం.

‘‘నీ కోరిక తీరడానికి మానవ రూపంతో పాటు నీకు కొన్ని అద్భుత శక్తులను ఇస్తాను. వాటిని మంచికి ఉపయోగిస్తే ఆ పుణ్యంతో నువ్వు కోరే పునర్జన్మ లభిస్తుంది. మనుషులను పీడిస్తే, వాళ్ళు దేవుడిచ్చిన మంత్రశక్తితో నిన్ను భూస్థాపితం చేస్తే, నీకీ స్వేచ్ఛ ఉండదు. ఒంట రిగా నరకం అనుభవిస్తావు,’’ అన్నది యోగిని.

‘‘నా భర్తతో వేరుకాపురం చెయ్యకపోతే నా స్వేచ్ఛ, శక్తులు వృథా. కాబట్టి దేవుడి బారి నుంచి తప్పించుకునే ఉపాయం ఉంటే చెప్పు,’’ అన్నది కామిని.

‘‘దేవుడు లేడని గట్టిగా నమ్ము. దేవుడివల్ల నీకే ప్రమాదమూ ఉండదు. దేవుణ్ణి నమ్మావో ఆ క్షణమే మనిషికి బానిస వవుతావు,’’ అంటూ ఉపాయంతో కలిసిన హెచ్చరిక చేసిన యోగిని అక్కడి నుంచి వెళ్ళిపోయింది.

కామిని మానవరూపం దాల్చి ఉత్సాహంగా వెళ్ళి మంగమ్మ ఇంటి తలుపు తట్టింది. కామిని దెయ్యమై వచ్చిందని గ్రహించిన తల్లీ కొడుకులకు గుండెలవిసి పోయాయి. కామిని తానెందుకు వచ్చిందీ చెప్పి, మంగమ్మను ఇంట్లోంచి వెళ్ళిపొమ్మన్నది. దెయ్యాన్నెది రించే ధైర్యం లేని మంగమ్మ కిమ్మనకుండా అక్కడి నుంచి వెళ్ళిపోయింది.

వణుకుతూ నిలబడ్డ వీరయ్యను చూసి, ‘‘భయపడకు. నాకిప్పుడు అద్భుత శక్తు లొచ్చాయి. వాటితో నిన్ను సంతోష పెడుతూ నా వేరుకాపురం సరదా తీర్చుకుంటాను,’’ అన్నది కామిని నవ్వుతూ.

వీరయ్యకు వెళ్ళిపోవాలని ఉన్నా, కామిని దెయ్యం ఆజ్ఞను ధిక్కరించలేక అక్కడే ఉండి పోయాడు. అప్పటి నుంచి అతడికి పన్నీటి జలకాల స్నానం, పంచ భక్ష్య పరమాన్నాల భోజనం. నృత్యగీత వినోదాలతో కాలక్షేపం, పట్టుపరుపులపై నిద్ర. అయితే, ఇల్లు దాటి వెళ్ళే స్వేచ్ఛ మాత్రం లేదు. వీరయ్యకు ఈ భోగాలు సంతోషాన్నివ్వలేదు. అతడు రోజూ కామినితో, ‘‘ఎన్ని సుఖాలున్నా నాకీ జీవితం నచ్చలేదు. నువ్వు నన్ను వదిలి పెడితే నేను మనుషుల మధ్య కలోగంజో తాగుతూ బతికి పోతాను,’’ అని ప్రాధేయపడేవాడు.

అందుకు కామిని ఒప్పుకోకుండా, ‘‘బతి కుండగా వేరు కాపురం పెడదామో అని గోల



పెట్టాను. నువ్వు వినలేదు. అత్త బతికున్న దెయ్యమై నన్ను వేధిస్తే నీకప్పుడు చీమకుట్టి నట్టయినా లేదు. నేను చచ్చి దెయ్యాన్నయినా నీకు సేవలు చేస్తున్నానే తప్ప వేధించడం లేదు. అయినా నీకీ జీవితం నచ్చలేదు. నాకు నచ్చనప్పుడు సర్దుకు పొమ్మన్నావు; కాబట్టి, నువ్వూ ఇప్పుడు సర్దుకుపో. సర్దుకు పోవడ మంటే తెలుస్తుంది,'' అనేది.

ఈలోగా ఇల్లొదిలి వెళ్ళిన మంగమ్మ కామిని దెయ్యం గురించి ఊళ్ళోవాళ్ళకు చెప్పి తన కొడుకును రక్షించమని వేడుకు న్నది. కాబోయే కోడల్ని పువ్వుల్లో పెట్టి చూసు కుంటాను అని చెప్పింది. కొందరు గ్రామ స్థులు ధైర్యం చేసి ఆ ఇంటికివెళ్ళారు. కామిని వాళ్ళ మీద అద్భుత శక్తులతో రాళ్ళూ, తేళ్ళూ కురిపించి హడల కొట్టి పంపింది. దాంతో వాళ్ళు కామిని దెయ్యాన్ని వదలగొట్టేపనిని మంత్రాల మరిడయ్యకు అప్పగించారు. మరిడయ్య వేప మండలు, నిమ్మకాయలు తీసుకుని వెళ్ళి మంత్రాలు చదివాడు. కామిని వికటంగా నవ్వి, ''నేను దేవుణ్ణి నమ్మను. నీ మంత్రాలు నా మీద పనిచెయ్యవు,'' అంటూ అతణ్ణి రెండు చేతులతో ఎత్తి గిరగిరా తిప్పి దూరంగా విసిరి వేసింది. నడుం విరిగిన మరిడయ్య మళ్ళీ ఆ ఇంటి గడప తొక్కలేదు. దెయ్యం ఊసెత్తలేదు.

ఆ సమయంలో కామిని దెయ్యాన్ని తాను పారదోలుతానంటూ ముందుకు వచ్చింది మాధవి. ఎవరివల్లా కానిపని ఆమెవల్ల నేమవు తుందని కొందరనుకున్నారు. మంగమ్మ కోడలు కావడంకంటే మరణమే మేలని ఇంతకు తెగించిందని మరి కొందరన్నారు. ఏ పుట్టలో ఏపాముందో అని అందరూ అనుకోవడం వల్ల ఒక్కరూ మాధవిని వారించలేదు.



మాధవి వీరయ్య ఇంటికి వెళ్ళి తలుపు తడితే, కామిని తలుపు తీసి, ''ఎవరు నువ్వు? ఎందుకు వచ్చావ్?'' అని అడిగింది.

''నా పేరు మాధవి. ఈ ఇంట్లో ఉన్న వీరయ్య నాకు కాబోయే భర్త. అతడితో పెళ్ళి ఏర్పాట్ల గురించి మాట్లాడడానికి వచ్చాను,'' అన్నది మాధవి.

''వీరయ్య నా భర్త. నేనుండగా అతడు మరో పెళ్ళి చేసుకోడు. నువ్వు వచ్చిన దారినే వెళ్ళు,'' అన్నది కామిని కోపంగా.

''నువ్వెవరో నాకు తెలియదు. కామిని చచ్చిపోయిందని నాకు తెలుసు. అందుకే వీరయ్యతో పెళ్ళికి ఒప్పుకున్నాను,'' అన్నది మాధవి.

కామిని అప్పుడు తన కథ చెప్పి, ''మంగమ్మ పరమ గయ్యాళి. వీరయ్య తల్లి కొంగుచాటునే ఉంటూ పెళ్ళాం కష్టాలు పట్టించుకోని చేత కానిమొగుడు. నేను దెయ్యాన్ని గనక, నా శక్తులతో వాళ్ళిద్దరినీ లొంగదీశాను. మామూలు మనిషివైన నువ్వు వీళ్ళతో వేగలేవు,'' అని హితవు చెప్పింది.

''అత్తను ఎదిరించే ధైర్యంలేక చంపాలనుకున్నావు. అది తప్పు. అందుకే దేవుడు నీ ప్రాణాలేపోయేలా చేశాడు. నేనేమో వాళ్ళ బుద్ధులు మారాలని జగదంబను పూజించాను. నా పూజలు ఫలించి వాళ్ళు మారారు,'' అన్నది మాధవి.

''వాళ్ళను నీ పూజలు మార్చలేదు. దెయ్యమై వచ్చి నేను మార్చాను. నేను నిన్నేమీ చెయ్యను. వేరెవరినైనా పెళ్ళి చేసుకుని సుఖంగా ఉండు,'' అన్నది కామిని.



''మనిషివి కాని నీకు మనుషుల మధ్య స్థానం లేదు. అత్త-భర్త నీవల్ల బాగుపడి ఉంటే, ఆ పుణ్యం నీది. దాంతో నువ్వు కోరే పునర్జన్మ లభిస్తుంది. అలా మనిద్దరికీ మేలు జరుగుతుంది,'' అంటూ మాధవి కళ్ళు మూసుకుని దేవుణ్ణి ప్రార్థించసాగింది. కామిని పకపకా నవ్వి, ''నేను దేవుణ్ణి నమ్మను. నమ్మని వాళ్ళను నీ దేవుడు ఏమీ చేయలేడు. ఇప్పుడు నిన్నేం చేస్తానో చూడు,'' అంటూ విరబోసుకున్న జుట్టుతో, పెద్ద పెద్ద కోరలతో, పొడవైన నాలుకతో భీకర రూపం దాల్చింది.

మాధవి ఏమాత్రం భయపడకుండా, ''నాకు దేవుడు తోడున్నాడు. నీ ఇంద్ర జాలం నా దగ్గర పనిచేయదు. నేను దెయ్యాలను నమ్మను,'' అన్నది.

మరుక్షణమే కామిని, ''మనుషుల మధ్య దెయ్యానికి స్థానం లేదన్న నీ మాట నిజం.

నువ్వు వీరయ్యను పెళ్ళాడి సుఖంగా ఉండు, నేను పునర్జన్మ కోసం పోతున్నాను,'' అంటూ అక్కడి నుంచి మాయమయింది.

బేతాళుడు ఈ కథ చెప్పి, ''రాజా, ఇష్టం లేని వీరయ్యను మాధవి ఎందుకు పెళ్ళి చేసుకోవాలనుకున్నది? పేదలైన తల్లిదండ్రుల గుండెల మీది భారాన్ని దించడానికే మనసు మార్చుకున్నదా? అంతవరకు ప్రతీకార వాంఛతో గెంతులు వేసిన కామిని, తాను దెయ్యాలను నమ్మనని మాధవి చెప్పగానే ఎందుకు మాయమైపోయింది? ఈ సందేహాలకు సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో నీ తల పగిలిపోతుంది,'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, ''మంగమ్మ గయ్యాళి స్వభావం, వీరయ్య పిరికితనం గురించి తెలియడం వల్ల మొదట మాధవి వీరయ్యను పెళ్ళాడడానికి భయపడిన మాట వాస్తవమే. అందుకే ఆమె వాళ్ళల్లో మార్పుకోరి ఇష్టదేవతను పూజించింది. ఆమె పూజ ఫలించి వాళ్ళిద్దరిలో మంచి మార్పు వచ్చింది గనకనే ఆమె వీరయ్యను పెళ్ళాడడానికి నిర్ణయించింది. ఇక కామిని తన అద్భుత శక్తులతో వీరయ్యకు ఎన్ని సుఖభోగాలు సమకూర్చినా ఆమె సాంగత్యంలో అతడు సంతోషం పొందలేక పోయాడు. దాంతో అద్భుత శక్తులు మనిషికి సుఖాన్నివ్వలేవనీ; మనిషితో సుఖంగా జీవించాలంటే మనిషి జన్మే కావాలనీ ఆమె అనుభవ పూర్వకంగా గ్రహించింది. పైగా మాధవి మాటల ద్వారా ఆమెకు తాను సాయపడిన పుణ్యం తనకు పునర్జన్మ నిస్తుందన్న నమ్మకం కూడా కలిగి ఉండవచ్చు. అంటే, తను మంగమ్మనూ, వీరయ్యనూ మార్చడం వల్ల మాధవికి ప్రయోజనం కలిగితే, అందుక్కారణం మాధవి దైవాన్ని ప్రార్థించడమే అని కూడా నమ్మినట్టే అవుతుంది కదా! ఆ నమ్మకం ఆమెను మాధవికి బానిసను చేసిందని కూడా భావించవచ్చు. దెయ్యాలను నమ్మని మాధవిని తానేమీ చేయలేనని తెలియడం వల్ల ఆమె అక్కడి నుంచి మాయమయింది,'' అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. – (కల్పితం)

[ఆధారం : ''వసుంధర'' రచన]



# చందమామ కబుర్లు

## స్లమ్‌డాగ్ మిలీయనీర్ అవార్డుల పంట

లాస్ ఏంజెలెస్‌లో ఇటీవల జరిగిన 81వ ఆన్యుయల్ అకాడెమీ అవార్డ్స్ ప్రదాన కార్యక్రమంలో 2 ఆస్కార్‌లను గెలుపొంది సుప్రసిద్ధ సంగీత దర్శకుడు ఏ.ఆర్.రెహ్మాన్ చరిత్ర సృష్టించాడు. ఈ చిత్రం 8 ఆస్కార్ అవార్డులను కైవసం చేసుకున్నది. మన దేశానికి చెందిన రసూల్‌పూక్కుట్టి బెస్ట్ సౌండ్ మిక్సింగ్‌కు మరిద్దరితో కలిసి ఆస్కార్ అవార్డు అందుకున్నాడు.

అవార్డును అందుకున్న 'జయ్‌హో' గీతాన్ని సుప్రసిద్ధ గీత రచయిత గుల్జార్ రచించాడు. డానీ బోయెల్ దర్శకత్వం వహించిన ఈ చిత్రం జమాల్ అనే మురికి వాడ యువకుడి కథను హృద్యంగా చిత్రీకరించింది. జమాల్ తన ప్రేమను మళ్ళీ పొందే ప్రయత్నంలో ''హు వాంట్స్ టు బి మిలియనీర్?'' ఇండియన్ రియాలిటీ షోలో ఇరవై మిలియన్ రూపాయలు గెలుపొందుతాడు. జమాల్ పాత్రను దేవ్‌పటేల్ పోషించాడు.





## 2020 నాటికి చంద్రుడిపై మన త్రివర్ణ పతాక



చంద్రయాన్-1 విజయం తరవాత ప్రస్తుతం మన దేశం 2020 నాటికి చంద్రుడిపై త్రివర్ణ పతాకాన్ని ఆవిష్కరించడానికి పథకం రూపొందిస్తున్నది. 2015 నాటికి అంతరిక్షానికి మనిషిని పంపే అవకాశం కూడా ఉన్నది. ఈ విషయాన్ని ఇస్రో విక్రమ్ సారాభాయ్ స్పేస్ సెంటర్ డైరెక్టర్ కె. రాధాకృష్ణన్ తెలియజేశారు. ఆయన అభిప్రాయం ప్రకారం 2015 నాటికి భూమికి 200 కి.మీ. దూరంలోని కక్ష్యలో ఇద్దరు వ్యోమగాములు పరిభ్రమించి రాగలరు.

తమ సొంత సాంకేతిక పరిజ్ఞానంతో నిర్మించబడే మొట్టమొదటి ఇండియన్ స్పేస్ క్రాఫ్ట్‌తో అది సా కాగలదని ఇస్రో విశ్వసిస్తున్నది.

1984లో మన దేశానికి చెందిన రాకేష్ శర్మ అనే భారతీయుడు సోవియట్ స్పేస్ క్రాఫ్ట్‌లో అంతరిక్షయానం చేసి వచ్చాడు. భారతీయ సంతతికి చెందిన ఇద్దరు మహిళలు కల్పనా చావ్లా, సునీతా విలియమ్స్-యు ఎస్ స్పేస్ క్రాఫ్ట్‌లో అంతరిక్షయానం చేసి వచ్చారన్నది ఈ సందర్భంగా గుర్తు చేసుకో తగ్గ విశేషాలు.



# భనందుడు

ప్రేమ వివాహాలకు ఆస్తులు–అంతస్థులు, సామాజిక తారతమ్యాలు తీరని అవరోధాలు గానే ఉంటున్నాయి. ఇవి వివిధ రూపాలలో, విభిన్న వాదాలతో యుగయుగాలుగా కొన సాగుతూనే ఉన్నాయి. పర్యవసానాలను పట్టిం చుకోకుండా ప్రేమికులు తెగువతో మూడు ముళ్ళు వేసుకున్నప్పటికీ వాళ్ళ సంతతికి సమస్యలు తలెత్తుతాయి. అలాంటి సమ స్యను దీటుగా ఎదుర్కొని సమర్థతతో పరిష్క రించుకున్న పురాణ వీరకుమారుడు భనం దుడు.

సంప్రదాయ బద్ధుడైన ధృష్టుడనే రాజు ఏకైక కుమారుడు నాభాగుడు. యౌవనంలో ఉన్న నాభాగుడు నగర విహారం చేస్తూ, కన్యకా పరమేశ్వరి ఆలయం నుంచి వెలుపలికి వస్తూన్న ఒక అందాల యువతిని చూసి ముగ్ధుడయ్యాడు. ఆమె అందచందాలకు పరవశుడై, అదే సమయానికి మూడు రోజులు వరుసగా అటు కేసి వచ్చి ఆమె వివరాలు అడిగి తెలుసుకున్నాడు. తన మనసులోని కోరికను బయటపెట్టాడు.

ఆ యువతి పేరు సుప్రభ. నగరంలో ప్రముఖ వర్తకుడి కుమార్తె. ఆమెకు కూడా ఇష్టం కావడంతో నాభాగుణ్ణి వివాహమాడడా నికి సంతోషంగా సమ్మతించింది. కాని, తండ్రి అంగీకారం అవసరమన్నది.

నాభాగుడు సుప్రభ తండ్రిని కలుసుకుని విషయం చెప్పాడు. పూర్వాచార పరాయణు డైన అతడు అంతావిని, ''క్షత్రియ యువ కుడు వైశ్య కన్యను చేసుకోవడం మంచిది కాదు,'' అన్నాడు.

అయినా నాభాగుడు ఆమెను వదులుకోవ డానికి ఇష్టపడక వివాహమాడి తీరుతానని పట్టుపట్టాడు.

పురాణ వీరకుమారులు – 11

''నీకూ నాకూ ఏలిక మీ తండ్రి. సర్వ ధర్మాలను ఎరిగినవాడూ, ధర్మపరిరక్షకుడూ అయిన ఆయన నిర్ణయం తీసుకుందాం, సరేనా?'' అన్నాడు సుప్రభ తండ్రి.

నాభాగుడు అందుకు అంగీకరించాడు. ఇద్దరూ వెళ్ళి తమ సమస్య గురించి రాజుకు చెప్పుకున్నారు.

''ఈ పెళ్ళి ధర్మ సమ్మతం కాదు,'' అని రాజు అభ్యంతరం తెలియ జేశాడు.

అయితే, నాభాగుడు తండ్రి నిర్ణయాన్ని కూడా లెక్క చేయకుండా, సుప్రభను రాక్షస పద్ధతిలో ఎత్తుకు వచ్చి వివాహమాడాడు.

సుప్రభ తండ్రి రాజు వద్ద మొరపెట్టుకున్నాడు. రాజు ధర్మావేశంతో కొడుకుతోనే యుద్ధానికి తలపడ్డాడు.

ఆ సమయంలో అక్కడికి వచ్చిన పరివ్రాజు డనే ముని అటుగా వచ్చి, యుద్ధ కారణం అడిగి తెలుసుకుని, ''నాభాగుడు వైశ్య స్త్రీని వివాహమాడి వైశ్యుడయ్యాడు. అందువల్ల క్షత్రియుడు వైశ్యుడితో యుద్ధం చేయడం పాడి కాదు,'' అని ధర్మం తెలియజేశాడు.

తండ్రీ కొడుకుల మధ్య యుద్ధం ఆగిపోయింది గాని, రాజు నాభాగుణ్ణి వైశ్య వృత్తిని అవలంబించమని ఆజ్ఞాపించాడు.

అదే విధంగా వ్యాపార రంగంలో దిగిన నాభాగుడికి సుప్రభ ద్వారా భనందుడు జన్మించాడు. విద్యాబుద్ధులు నేర్చుకుంటూ పెరిగి పెద్దవాడైన భనందుడు ఒకనాడు తల్లిని, 'నేను ఏ వృత్తి అవలంబించాలి?'' అని తల్లిని అడిగాడు.



''గోవులను సంరక్షించు. అదే ఉత్తమమైన వృత్తి,'' అన్నది తల్లి.

''గోరూపిణి అయిన భూమిని శత్రువులు పాలిస్తున్నారు. దానిని చూస్తూనేను గోవులను కాస్తూ కూర్చోవడం వీరుడి లక్షణం కాదు,'' అని భనందుడు తీవ్రంగా ఆలోచిస్తూ, భూమిని సంపాదించడానికి నూతన మార్గాలు అన్వేషించసాగాడు.

అతడు పట్టుదలతో హిమాలయాలకు వెళ్ళి, నీవుడు అనే రాజర్షిని దర్శించి శుశ్రూషలతో కొన్ని రోజులు గడిపి సమయం చూసి తన సమస్యను తెలియజేశాడు.

నీవుడు శస్త్రాస్త్రవిద్యలలో నిపుణుడు. ఆయన సంతోషంగా భనందుడికి తనకు తెలిసిన విద్యలను స్వల్ప కాలంలోనే నేర్పాడు.

భనందుడు నగరానికి తిరిగి వచ్చే నాటికి రాజు మరణించాడు. రాజ్యాన్ని పినతండ్రి కుమారుడైన వసురాతుడు పరిపాలిస్తున్నాడు. భనందుడు అతడి వద్దకు వెళ్ళి, తన తండ్రి భాగమైన అర్ధ రాజ్యాన్ని తనకు ఇవ్వమని అడిగాడు.

వసురాతుడు అందుకు అంగీకరించలేదు. ''నీ తండ్రి వైశ్యస్త్రీని వివాహమాడి, వైశ్యుడై రాజ్యార్హత లేకుండా చేసుకున్నాడు. అతడికి లేని రాజ్యార్హత నీకెలా వస్తుంది? నీకు అర్ధరాజ్యం ఇవ్వను,'' అని నిష్కర్షగా చెప్పేశాడు.

''రాజ్యం వీరభోజ్యం కదా? యుద్ధం ద్వారానే తేల్చుకుందాం,'' అంటూ భనందుడు యుద్ధానికి సన్నద్ధుడయ్యాడు.

యుద్ధంలో వసురాతుడు మరణించడంతో పూర్తి రాజ్యమే భనందుడి వశమయింది. అయితే, అతడు దాన్ని తానే స్వయంగా పాలించకుండా, తండ్రి అయిన నాభాగుణ్ణి పాలించమని కోరాడు.

కొడుకు పితృభక్తికి పరమానందం చెందిన నాభాగుడు, ''నేను ఎప్పుడో రాజ్యార్హత కోల్పోయాను. ఇది నువ్వు గెలుచుకున్న రాజ్యం కదా? నువ్వే పాలించు,'' అని ఆశీర్వదించాడు.

భనందుడు రాజై ప్రజలకు ఎలాంటి కొరతా రానీయకుండా చిరకాలం రాజ్యపాలన చేశాడు.



మన వారసత్వ స్థలాలు

# కజిరంగా జాతీయోద్యానం

**భా**రత దేశంలో సుప్రసిద్ధమైన ఒంటికొమ్ము ఖడ్గ మృగాలకు నివాసస్థానం కజిరంగా జాతీయోద్యానం. చారిత్రక పూర్వయుగం నుంచి బతికిఉన్న అతికొద్ది జంతువులలో ఒకటి రినోజరస్ అనబడే ఈ ఖడ్గమృగాలు.

కజిరంగా జాతీయోద్యానం అస్సాంలోని గోలాఘట్ జిల్లాలో కొంత, నాగాంవో జిల్లాలో కొంత విస్తరించి ఉన్నది. బ్రహ్మపుత్ర నదీ తీరంగుండా 430చ.కి.మీ విస్తీర్ణంలో ఉన్నది. హిమాలయ పాదతలంలోని అడవులలోనూ, ఎత్తయిన గడ్డిభూములలోనూ, ఖడ్గమృగాలు ఉంటున్నాయి. తూర్పు భారత దేశంలో జన సంచారం అంతగాలేని ప్రాంతం కజిరంగా జాతీయోద్యానం. ఇక్కడే ఖడ్గ మృగాలు అధిక సంఖ్యలో కనిపిస్తాయి. ఖడ్గ మృగాలతో పాటు పులులు, చిరుతలు, ఏనుగులు, మొరిగే జింకలు, ఎలుగుబంట్లు మొదలైన జంతువులు కూడా ఇక్కడ ఉన్నాయి.

కజిరంగా జాతీయోద్యానం 1940లో అభయారణ్యంగా ప్రకటించబడింది. 1974లో జాతీయోద్యానం(నేషనల్ పార్క్)గా ప్రకటించబడింది. 1985లో ప్రపంచ వారసత్వ ప్రదేశాల జాబితా లోకి తీసుకోబడింది.

నవంబర్ నుంచి ఏప్రిల్ వరకు ఈ జాతీయోద్యానం పర్యాటకులకు తెరిచి ఉంటుంది. ఏనుగుల మీద ఎక్కి, బ్రహ్మపుత్రలో పడవ ప్రయాణం చేస్తూ పర్యాటకులు ఈ జాతీయోద్యానాన్ని సందర్శిస్తారు.




**అక్కడికి చేరుకోవడం ఎలా?**

విమాన మార్గం: గౌహతి విమానాశ్రయం 217కిమీ. దూరంలో ఉన్నది. కజిరంగాకు మరీ దగ్గరగా 97కి.మీ. దూరంలో జోర్హాట్ విమానాశ్రయం ఉన్నది.

రైలు మార్గం: 75కి.మీ. దూరంలో ఫర్కేటింగ్ రైల్వే స్టేషన్ ఉన్నది.

రోడ్డు రవాణా: కజిరంగా వన్యమృగ అభయారణ్యం ప్రధాన ప్రదేశ ద్వారం 37వ నంబర్ నేషనల్ హైవే మీద కోవనోరా వద్ద ఉన్నది. గౌహతి, తాజ్ పూర్, ఎగువ అస్సాం వెళ్ళే ప్రైవేటు వాహనాలూ, ప్రభుత్వ ఎఎస్‌టిసి బస్సులూ కజిరంగా వద్ద ఆగుతాయి.

మీ మొబైల్లో ఇండియన్ హెరిటేజ్ క్విజ్‌లో ఆడుకోవాలనుకుంటే CIHQ 54646కు SMS చెయ్యండి.

బీర్బల్ కథలు : 20

# ప్రీతిపాత్రమైన అత్యంత విలువైన ఆస్తి



అక్బర్ చక్రవర్తి ఎప్పుడు దేనికి ఎలా ప్రతిస్పందిస్తాడో ఎవరికీ తెలియదు. ఆయనకు ఎప్పుడు నవ్వు వస్తుందో, ఎప్పుడు కోపం వస్తుందో చెప్పడం కష్టం. ఒక్కోసారి తన మీద హాస్యమాడే వారిని చూసి కూడా నవ్వేసేవాడు. ఒక్కోసారి అమాయకతతోనో, ఏమరుపాటుతోనో చొరవ కొద్దీ సరదాగా ఏదైనా అన్నా కోపంతో కుతకుతలాడి పోయేవాడు. ఆయన ముఖం కోపంతో కందిపోయేది! అయితే, ఎంత కోపం వచ్చినా ఆ వెంటనే చల్లబడి పోయేవాడు.

ఒకనాటి సాయంకాలం ఉద్యానవనం పక్కన చక్రవర్తి, బేగంతో కలిసి కూర్చుని ఉన్నాడు. ఉద్యానవనం మీదుగా వీచే చల్లటి మల్లెల సువాసనలు నిండిన వాయువులను చక్రవర్తి ఆనందంగా ఆస్వాదిస్తున్నాడు.

చక్రవర్తిని సరదాగా ఆటపట్టించాలనే ఉద్దేశంతో బేగం ఆయనను, ''మీరు నన్ను ప్రేమించడంకన్నా మల్లెల సువాసనను ఎక్కువగా ప్రేమిస్తున్నట్టున్నది?'' అని అడిగింది.

''అయితే ఏం? నువ్వు మల్లెలంత సువాసనతో ఎప్పుడైనా ఉన్నావా? మల్లెలు నాకు నిజమైన ఆనందాన్ని ఇస్తున్నాయి,'' అన్నాడు చక్రవర్తి.

''నా సాహచర్యంలో మీరు నిజమైన ఆనందం పొందుతారనుకున్నానే,'' అన్నది బేగం.

''నీతో కూర్చున్నప్పుడు ఆనందంగా ఉండాలని నన్ను నువ్వు శాసించలేవు,'' అన్నాడు చక్రవర్తి గంభీరంగా.

''తమ బేగానికి ఆ మాత్రం హక్కు కూడా లేదా?''అంటూ బేగం పెదవులు బిగించి ఆనందం నిండిన కళ్ళతో చూసింది.

''నా మీద ఎవరికీ ఎలాంటి హక్కులూ లేవు. నేను నా ఇష్టానుసారం ఉంటాను. నేను షహేన్‌షాను,'' అంటూ దగ్గరికి రానున్న బేగంను అవతలికి తోశాడు చక్రవర్తి.

''నేను కూడా షహేన్‌షా బేగం సహీబాను,'' అన్నది బేగం చెమ్మగిల్లిన కళ్ళతో.

''ఉండవచ్చు. అయితే, ఆ హోదా నీకెంతో కాలం ఉండదు,'' అన్న మాటలు లావా ద్రవంలా చెవులకు సోకగానే బేగం కన్నీళ్ళు పొంగిపొర్లాయి.

చక్రవర్తి చివాలున లేచి, ''నీ నీలి ఏడుపులకు నేను చలించను బేగం సహీబా. ఈ క్షణంతో మన బంధం ముగిసిపోయింది. నీ వస్తువులన్నిటినీ మూటకట్టుకుని మీ తండ్రిగారింటికి వెళ్ళిపో. నీ కిష్టమైన వస్తువులన్నిటినీ తీసుకెళ్ళు. నీ కత్యంత ప్రీతి పాత్రమైన వాటినల్లా పట్టుకెళ్ళు,'' అని చెప్పి వెళ్ళిపోయాడు.

బేగం ఆయన వెంటనే వెళ్ళాలనుకున్నది గాని, ధైర్యం చేయలేక అక్కడే ఆగిపోయింది. చక్రవర్తి వెళ్ళిన దిక్కు కేసి చూస్తూ, కోపం తగ్గి శాంతించాక రమ్మని కబురు చేయగలడని మనసును దిటవు చేసుకున్నది.

అయితే, రాత్రి కూడా చక్రవర్తి రాలేదు. నిజంగానే తనను తండ్రిగారింటికి పంపేస్తాడా? ''నేను సరదాగా అన్న మాటలను మీరంత తీవ్రంగా తీసుకోనవసరం లేదు. భార్యాభర్తల మధ్య ఆ మాత్రపు సరసాలు సహజమే కదా?'' అంటూ పరిచారిక ద్వారా చక్రవర్తికి సందేశం పంపింది.

ఆ సందేశం అందుకున్న చక్రవర్తి, ''ఈ రోజు సాయంకాలానికల్లా బేగం సహీబాను వెళ్ళిపోవాలని చెప్పు. ఆమెకు ప్రీతిపాత్రమైన వాటినన్నిటినీ తనతో తీసుకువెళ్ళ వచ్చుని చెప్పు,'' అన్నాడు కోపంగా.

పరిచారిక ద్వారా ఆ మాట విన్న బేగం విచారానికి లోనయింది. ''ఇప్పుడు ఏం చెయ్యడం? సరదాగా అన్న మాట తుఫానై ముంచెత్తుతోంది. ఈ అపాయం నుంచి గట్టెక్కించే వావెవరు?'' అనుకుంటూ బేగం అటూ ఇటూ తిరగసాగింది.

ఉన్నట్టుండి ఆమెకు బీర్బల్ గుర్తుకు వచ్చాడు. అతడే సరైన సలహా ఇవ్వగలడు. ఈ విషయంలో అతడి సాయం తీసుకోవాలని నిర్ణయించింది. అతణ్ణి పిలుచుకు రమ్మని పరిచారికను పంపింది.

బీర్బల్ వచ్చి నుదుటితో నేలను తాకి లేచి నిలబడి, ''బేగం సహీబా! సలాం అలేయ్ కుమ్!'' అన్నాడు.

''అలేకుం సలాం బీర్బల్‌జీ!'' అన్నది బేగం మేలిముసుగును తొలగించకుండా. ఆ



# మన దేశం క్విజ్

## ఈ ప్రముఖులను గుర్తించండి:



1. ఈయన ప్రథమ స్వాతంత్ర్య సమర చరిత్రను మరాఠీ భాషలో రచించాడు.
2. ఈయన బీహారులో సహాయ నిరాకరణోద్యమాన్ని నడిపి 1930లో ఉప్పు సత్యాగ్రహం చేశాడు.
3. ఈయన కథలలో మాల్గుడి కల్పిత ప్రదేశం.
4. మోటారు కారు పందెంలో పాల్గొన్న మొదటి భారతీయుడు.
5. 10,000 పద్యాలతో తమిళంలో రామాయణం రచించాడు.
6. తన 'కయర్' (మలయాళ) రచనకు 1984లో జ్ఞానపీఠ పురస్కారం అందుకున్నాడు.
7. అమృతసర్ హరిమందిర్ బంగారు పూతకు ఐదు లక్షల రూపాయలు విరాళంగా ఇచ్చాడు.
8. కావేరీ నదికి రాతి ఆనకట్ట నిర్మించాడు. 'కాలిన పాదాలు కలవాడు' అనే అర్థం వచ్చేలా ఈ రాజు పేరు ఉంటుంది.

(సమాధానాలు 74వ పేజీలో)

తరవాత, ''మా వివాహ బంధాన్ని, కాపాడుకునే మార్గం నువ్వే చూపాలి,'' అంటూ ఆమె పొంగి పొర్లే బాధను దిగమింగుకుని జరిగిన సంగతిని క్లుప్తంగా వివరించింది.

''తమరు ఏమాత్రం విచారించకండి బేగం సహీబా! నేను చెప్పినట్టు చేశారంటే, తుఫాను తొలగిపోతుంది,'' అంటూ సమస్యను పరిష్కరించే ఉపాయం చెప్పాడు బీర్బల్.

''నిజంగా అది పనిచేస్తుందంటావా?'' అని అడిగింది బేగం.

''తప్పకుండా పనిచేస్తుంది. ధైర్యంగా కార్యాచరణకు దిగండి. నా పథకానికి తిరుగంటూ ఉండదని మీకు తెలుసుకదా?'' అన్నాడు బీర్బల్.

''నా ఈ ఇబ్బందిని తొలగించగలవాడివి నువ్వొక్కడివే అని నాకు తెలుసు,'' అంటూ తల పంకించింది బేగం.

''నా మాట నమ్మండి. ధైర్యంతో కార్యాచరణకు దిగండి. తుఫాను వీగిపోతుంది,'' అని చెప్పి అక్కడి నుంచి సెలవు తీసుకున్నాడు బీర్బల్.

బేగం తనకూ, చక్రవర్తికీ ఒక రోజు వరకు కావలసిన వస్తువులను తీసి మూట గట్టింది. ఆ తరవాత పరిచారిక ద్వారా చక్రవర్తికి, ''షహేన్‌షా! నేను వెళ్ళడానికి సిద్ధంగా ఉన్నాను. వెళ్ళే ముందు తమరిని ఒకసారి చూడాలని ఉన్నది. నా తప్పులన్నిటినీ క్షమించి దయచేసి ఒకే ఒక్కసారి వచ్చి వెళ్ళాలని ప్రార్థిస్తున్నాను,'' అని కబురు పంపింది. కబురందగానే, ''ఒక గంటలో అక్కడికి రాగలనని

బేగంకు చెప్పు,'' అన్నాడు చక్రవర్తి.

అదే విధంగా ఒక గంట గడిచేలోగా చక్రవర్తి బేగం అంతఃపురంలో అడుగు పెట్టాడు. ద్వారం వద్ద నిలబడి ఎదురు చూస్తూన్న బేగం మందహాసంతో ఎదురువచ్చి లోపలికి తీసుకువెళ్ళింది. కూర్చోగానేచక్రవర్తి, ''ఎప్పుడు వెళ్ళాలనుకుంటున్నావు బేగం సహీబా!'' అని అడిగాడు.

''ఇప్పుడే షహేన్‌షా! తమకు నేనెప్పుడైనా తెలిసో, తెలియకో వాచా, కర్మణా, మనసా బాధ కలిగించి ఉంటే క్షమించమని వేడుకుంటున్నాను. దయచేసి క్షమించానని చెప్పండి. నిశ్చింతగా పుట్టింటికి వెళ్ళిపోతాను,'' అన్నది ప్రాథేయ పూర్వకంగా.

''సరే, అదంతా బాగానే ఉంది. ఎప్పుడు బయలుదేరతావు?'' అని అడిగాడు చక్రవర్తి.

''ఒక్క నిమిషం!'' అంటూ ఆమె పళ్ళ రసాన్ని తెచ్చి చక్రవర్తికి అందిస్తూ, ''తమకు నేనిచ్చే చివరి పళ్ళరసం ఇది. నా కోసం దీనిని స్వీకరించండి,'' అన్నది మృదుమధురమైన కంఠస్వరంతో.

చక్రవర్తి ఆమెను ఒకసారి నఖశిఖ పర్యంతం పరిశీలనగా చూశాడు. ఆ తరవాత పాత్రను అందుకుని ఫలరసాన్ని గుటగుటా తాగేసి వెళ్ళడానికి వెనుదిరిగి తలుపు వద్దకు వెళ్ళి వెనక్కు తిరిగి చూస్తూ, ''నువ్వు వెళ్ళేప్పుడు నీకిష్టమైన వాటినన్నిటినీ, నీ విలువైన ఆస్తులన్నిటినీ నీతో తీసుకువెళ్ళు,'' అన్నాడు.

''మీ దయకు చాలా కృతజ్ఞతలు షహేన్‌షా!'' అంటూ బేగం చక్రవర్తికేసి నడిచింది.



అంతలోనే ఆయన కళ్ళు మూతలు పడుతున్నాయి. ''నాకెందుకో నిద్ర ముంచుకువస్తున్నది,'' అంటూ గడపను పట్టుకున్నాడు.

''షహేన్‌షా,'' అంటూ ఆమె చక్రవర్తిని పడిపోకుండా పట్టుకుని పడకకేసి నడిపించి నెమ్మదిగా పడుకోబెట్టింది.

పానీయం పనిచేయడం ఆరంభించిందని తెలియగానే క్షణం వృథా చేయకుండా ఆమె చకచకా కార్యరంగంలో దిగింది. చేతులు చరిచి సేవకులను పిలిచింది. చక్రవర్తిని అలాగే ఎత్తి బయట సిద్ధంగా ఉన్న పల్లకీలో పడుకోబెట్టమని పురమాయించింది. పరీక్షించి చూసి చక్రవర్తి సౌకర్యంగా పడుకున్నట్టు గ్రహించింది. ఆ తరవాత ఆమె మరో పల్లకీలో ఎక్కి కూర్చుని, రెండు పల్లకీలనూ తన తండ్రి

ఇంటికి తీసుకువెళ్ళమని బోయీలను పుర మాయించింది.

ఆమెను చూసి తల్లిదండ్రులు విస్మయం చెందారు.

''షహేన్‌షా కూడా నాతో వచ్చారు,'' అంటూ చక్రవర్తిని జాగ్రత్తగా పడకటింటికి చేర్చమని సేవకులను ఆదేశించింది.

దానిని చూసిన తండ్రి, ''చక్రవర్తికి ఏమయింది? బావున్నారు కదా?'' అని అడిగాడు ఆదుర్దాగా.

''దారిలో నిద్రపోయారు. అమితమైన పనులు. తీరికంటూ లేదు,'' అన్నది ఆమె.

పడకపై పడుకున్న చక్రవర్తి పక్కనే కూర్చుని ఓపిగ్గా వేచి చూడసాగింది.

ఒకగంట తరవాత కళ్ళు తెరిచిన చక్రవర్తి, ''నేనెక్కడ ఉన్నాను?'' అన్నాడు కళ్ళు నులుముకుంటూ. ఆ తరవాత ఆయన చూపులు బేగం మీద పడ్డాయి.

''నేను ఎక్కడ ఉన్నాను?'' అని అడిగాడు మళ్ళీ.

''మా తండ్రిగారి ఇంట్లో,'' అన్నది బేగం.

''నన్ను ఇక్కడికి తీసుకురావడానికి నీకు అనుమతి ఇచ్చిందెవరు?''

''తమరే, షహేన్‌షా,'' అన్నది బేగం ధైర్యంగా.

''నేనా? అబద్ధం!'' అన్నాడు చక్రవర్తి.

''కాదు షహేన్‌షా! తమరే కదా చెప్పారు, నాకు ప్రీతిపాత్రమైన విలువైన వాటిని నాతో తీసుకువెళ్ళవచ్చునని! నాకు అత్యంత ప్రీతిపాత్రమైన ఆస్తి మీరే కదా? అందుకే మిమ్మల్ని తీసుకువచ్చేశాను,'' అన్నది బేగం ఆనందంతో మెరిసే కళ్ళతో.

''నిజంగానే నువ్వు చాలా తెలివైన దానివి బేగం సహీబా! నీ మీద అకారణ ఆగ్రహం ప్రదర్శించినందుకు బాధ పడుతున్నాను,'' అని చెప్పి ఒక్క క్షణం ఆగి, ''నీకు అత్యంత ప్రీతిపాత్రమైన విలువైన ఆస్తినైన నన్నే ఎత్తుకు రమ్మని నీకెవరు సలహా ఇచ్చారు? నా నోటి మాటలనే నీకు ప్రయోజనకరంగా ఉపయోగించుకోమని చెప్పిన వారెవరు?'' అని అడిగాడు.

''మీరే చెప్పండి చూద్దాం,'' అన్నది బేగం.

చక్రవర్తి నవ్వుతూ, ''ఇంకెవరు? బీర్బల్ అయి ఉంటాడు,'' అనగానే అవునన్నట్టు బేగం తల ఊపింది.



ఉదయ తారలు:

# ఫెనిల్ షా

- ఫెనిల్ రోల్ మోడల్ వేరెవరో కాదు; గ్రాండ్ మాస్టర్ విషీ ఆనంద్!
- ఫెనిల్ చెస్ ఇంటర్నేషనల్ రేటింగ్: 2213 (2009 జనవరి ప్రకారం)
- అతడు చదివిన బెస్ట్ బుక్: ఒన్ నైట్ @ ది కాల్ సెంటర్.
- ఫెనిల్ అభిమాన పాఠ్యాంశం: గణితం.

గెలుపొందిన అవార్డులు:

- జూనియర్ ఏకలవ్యా అవార్డ్.
- కామన్వెల్త్ చెస్ ఛాంపియన్‌షిప్ (2005)లో స్పెషల్ అవార్డ్ ఫర్ సిల్వర్ మెడల్.
- శాంతిదూత్ అవార్డ్ ఫర్ నేషనల్ అండ్ ఇంటర్నేషనల్ అచీవ్‌మెంట్ ఇన్ చెస్ (2007)
- నేషనల్ చైల్డ్ అవార్డ్ ఫర్ ఎక్సెప్షనల్ పెర్‌ఫార్మెన్స్ ఇన్ స్పోర్ట్స్ (చెస్) 2007.

అహ్మదాబాద్ ఉద్గమ్ స్కూల్ విద్యార్థి ఫెనిల్ షా చెస్‌లో అనేక అవార్డులూ, పతకాలూ, ఛాంపియన్‌షిప్పులూ సాధించాడు. ఇంతకూ అతడి వయసు పదమూడేళ్ళే!

ఎంతో ఏకాగ్రత అవసరమైన తెలివైన క్రీడ చెస్ అంటాడు ఫెనిల్. రోజూ 3 – 4 గంటలు ప్రాక్టీస్ చేస్తాడు. ముఖ్యమైన టోర్నమెంట్ల ముందయితే ఇది రోజూ 7 – 8 గంటలవరకు పెరుగుతుంది. తన కంప్యూటర్ తనకు బలమైన ప్రత్యర్థి, ఉత్తమ కోచ్ అంటాడు ఫెనిల్. గ్రాండ్ మాస్టర్స్ సిఫార్సు చేసే ఫ్రిట్జ్ 11, చెస్ బేస్ 10, రైబ్కా సాఫ్ట్‌వేర్ ప్రోగ్రామ్స్ అన్నీ అతడి వద్ద ఉన్నాయి. సీనియర్ కోచ్ జి బి జోషి నుంచీ, గ్రాండ్ మాస్టర్ తేజస్ బక్రే నుంచీ సలహాలు తీసుకుంటాడు. పరీక్షల్లో తొంభై శాతానికి లోపుగా ఎప్పుడూ తెచ్చుకున్నది లేదు.

ఏషియన్, వరల్డ్ ఛాంపియన్‌షిప్పులలో భారతదేశం తరపున ఆడటానికి ప్రభుత్వం ద్వారా తను ఎంపిక కావడం ఫెనిల్ ఎంతో గొప్పగా చెప్పుకుంటాడు. మరింత శ్రద్ధగా శ్రమించి, మరింత క్లిష్టమైన సవాళ్ళను స్వీకరించి తన చెస్ రేటింగ్ పెంచుకుని త్వరలో ఒక ఇంటర్నేషనల్ చెస్ మాస్టర్ కావడానికి అతడు పథకాలు రూపొందిస్తున్నాడు.



# యమునా నదిలో పడవ ప్రయాణం

ఉష, లీల కవల పిల్లలు. తమిళనాడు మైథిలీ నదీ తీరం శాంతపురంలో ఉంటున్నారు. నదీ తీర ప్రాంత గ్రామస్థులు నదిని ఎంతో పవిత్రంగా భావించి నదీ జలాలను నిర్మలంగా ఉంచు కోవడానికి తగిన జాగ్రత్తలు తీసుకుంటారు. వాళ్ళ గ్రామం అన్నా, నది అన్నా అక్కాచెల్లెళ్లకు అమిత అభిమానం.

ఢిల్లీలో ఉంటూన్న వాళ్ళ మామయ్య కొడుకు గోపి గత వేసవి సెలవుల్లో వచ్చినప్పుడు యమునా నదిని గురించి చెప్పాడు. అప్పటి నుంచి దాన్ని చూడాలనే కోరిక వాళ్ళలో చిగురించింది. అందుకుతగ్గట్టు వాళ్ళ అమ్మ, ''మనం ఈ దీపావళి పండుగను ఢిల్లీలో మీ మామయ్య ఇంట్లో జరుపుకోబోతున్నాం,'' అని చెప్పగానే వారు ఎగిరి గంతేశారు. ఆ మరుసటి వారంలోనే ఢిల్లీకి బయలుదేరారు. ఢిల్లీలో వాళ్ళ మామయ్య పిల్లలకు ఒక్కొక్క



రోజు ఒక్కో కొత్త ప్రాంతాన్ని చూపాలని నిర్ణయించాడు. ఒకనాటి ఉదయం గోపీతో ముచ్చటిస్తున్న పిల్లల దగ్గరికి వెళ్ళి, నేను ''మిమ్మల్ని ఇవాళ ఒక కొత్త ప్రాంతానికి తీసుకెళతాను,'' అన్నాడు మామయ్య.

''ఎక్కడికి మామయ్యా?'' అని అడిగారు ఇద్దరూ ఒక్కసారిగా.

''అదే సస్పెన్స్!'' అంటూ కారు తలుపు తెరిచాడు మామయ్య. తాము ఎక్కడికి వెళుతున్నామా అని పిల్లలు ఉత్సాహంతో ఎదురు చూడసాగారు. కారు ఒక బ్రిడ్జ్ సమీపంలో మెల్లగా మలుపు తిరిగి ఆగింది. ఉష ఉత్సాహం ఆపుకోలేక, ''మనం ఇప్పుడు ఏ ప్రాంతానికి వచ్చాం, మామయ్యా?'' అని అడిగింది.

''ఢిల్లీకి జీవాధారమైన యమునా నదీ తీరం వజీరాబాద్‌లో ఉన్నాం, ఉషా. మనం ఇక్కడి నుంచి నది వెంట యమునానది ఢిల్లీలో ప్రవేశించేచోటి నుంచి వెలుపలికి వెళ్లే ఓఖ్లా వరకు నది వెంటే వెళతాం,'' అన్నాడు మామయ్య.

''అంత దూరం నడిచే వెళ్ళాలా?'' అని అడిగింది లీల. ''కాదు.. పడవలో వెళదాం!'' అన్నాడు మామయ్య.

''ఆహా..! పడవలోనా!'' అంటూ ఇద్దరూ ఉత్సాహంతో అరిచినంత పనిచేశారు.

చాలా రోజులుగా ఢిల్లీలోనే ఉన్నప్పటికీ గోపి కూడా ఎప్పుడూ ఇలాంటి పడవ ప్రయాణం చేయలేదు. అందరూ వెళ్ళి పడవలో కూర్చున్నారు. పడవ ముందుకు కదులుతూ ఉంటే, ''ఉషా, నదీ తీరంలోని ఆలయాలను చూడు, అక్కడక్కడ మెట్లు కనిపిస్తున్నాయి కదా!

వాటిని ఘాట్స్ అంటారు. మన దేశంలోని పవిత్రమైన నదులలో యమునా నది ఒకటి. మన నదులు కేవలం జల వనరులు మాత్రమే కాదు మన ప్రజా జీవితాల్లో అంతర్భాగాలు,'' అన్నాడు మామయ్య.



మరి కొంత దూరం ముందుకు వెళ్లగానే పచ్చటి కూరగాయలతో వచ్చిన ఒక పడవ వాళ్లను దాటుకుని వెళ్ళింది. కూరగాయలు ఎంతో తాజాగా ఉన్నాయి. వాటిని చూడగానే ఉష, ''లీలా, అటు చూడు. ఆ కూరగాయలు ఎంతపచ్చగా, తాజాగా ఉన్నాయో,'' అన్నది.

''ఈ కూరగాయలన్నీ ఈ నదీ తీరంలోనే పండుతాయా మామయ్యా?'' అని అడిగింది లీల. మామయ్య సమాధానం చెప్పేలోగా మరో పడవ కూరగాయలతో అటుగా వచ్చింది. పడవలోని రైతు, ''అవును, ఇవన్నీ నదీ తీరంలో పండినవే. యమున మా తల్లి. ఆమె లేకుండా మేము బతకలేము,'' అంటూ వెళ్ళిపోయాడు.

వాళ్ల పడవ ఇంకా ముందుకు సాగడంతో అక్కడ భిన్నమైన పరిసరాలు కంటబడ్డాయి. స్నాన ఘట్టాలలో సామానులు కడిగేవాళ్ళూ, జంతువులకు స్నానం చేయించేవాళ్ళూ కనిపించారు. ఆఖరికి వీచే దుర్గంధం భరించలేక పిల్లలు ముక్కులు మూసుకునే ప్రాంతానికి చేరారు. ''ఏమిటీ! నది ఇలా మురికి కాలువ కంపు కొడుతోంది?'' అని విసుక్కోసాగారు పిల్లలు ముఖాలు చిట్లిస్తూ.

''అవును. ఇదంతా ఫ్యాక్టరీల నుంచీ, నదీ తీరంలోని ఇళ్ల సముదాయాల నుంచీ, కార్యాలయాల నుంచీ వచ్చే కాలుష్యం వల్ల ఏర్పడిన దుష్ఫలితాలు,'' అంటూ పైపుల గుండా వచ్చి నదిలో కలిసే మురికి నీటి కాలువలను చూపాడు మామయ్య.

ఉష, లీల అటువంటి దృశ్యాలను ఎప్పుడూ చూసి ఎరుగరు. తామున్నది కూడా నదీ తీరంలోనే. కానీ తమ గ్రామస్థులెప్పుడూ నదిలో చెత్తా చెదారం వేసి ఎరుగరు!

''యమునానది వజీరాబాద్‌లో ప్రవేశించేప్పుడు ఎంతో నిర్మలంగా ఉంటోంది. ఢిల్లీ గుండా ప్రవహిస్తూ, ఇళ్ల నుంచీ, ఫ్యాక్టరీల నుంచీ వెలువడే కలుషిత జలాలను తనలో చేర్చుకుని దుర్గంధ భూయిష్ఠమై పోతున్నది,'' అని వివరించాడు మామయ్య.

''కలుషిత జలాలను శుభ్రపరచి మళ్ళీ ఉపయోగించుకోవచ్చు కదా? అది సాధ్యం కాదా నాన్నా?'' అని అడిగాడు గోపి.

''కలుషిత జలాలను శుభ్రపరచడం చాలా ఖర్చుతో కూడుకున్న పని గోపి. దురదృష్ట



"ఏమిటి నాన్నా, అది?'' అని అడిగాడు గోపి.

''అది మరో రకం కాలుష్యం. యమునా నదిని పవిత్రంగా భావించడం వల్ల, భక్తులు పూలనూ, పసుపుకుంకుమలనూ అందులో వేస్తూ ఉంటారు. వాటిని చాలా వరకు ప్లాస్టిక్ సంచులతో నింపి వేస్తూంటారు. నిజానికి అవి నదిని ఊపి రాడకుండా చేస్తాయని వాళ్ళు గ్రహించడం లేదు. పువ్వులు మగ్గిపోతాయి గానీ, పాలిథీన్ సంచులు మగ్గవు. అలాగే తేలుతూ ఉంటాయి,'' అని వివరించాడు గోపి తండ్రి.

''మరి, ఈ సమస్యకు పరిష్కారమే లేదా మామయ్యా?'' అని అడిగింది ఉష.

''ప్రజలలో కాలుష్యం పట్ల స్పృహను, నివారణ గురించిన అవగాహనను పెంచడం ఒక్కటేపరిష్కారం. యమునా నదిని నిర్మలంగా కాపాడుకోవాలంటే మనమందరం అందుకు బాధ్యత వహించాలి,'' అన్నాడు మామయ్య నిట్టూరుస్తూ.

ఆ సరికి వాళ్ళు చాలా దూరం ముందుకు వెళ్ళి, ఓఖ్లా ప్రాంతాన్ని చేరుకున్నారు. అక్కడి అందమైన పక్షులను చూసి ఉద్వేగంతో, ''అక్కడ చూడు పక్షులు ఎంత అందంగా ఉన్నాయో!'' అన్నది ఉష.

''రకరకాల పక్షులకు యమున నివాస స్థానం. శీతాకాలంలో అయితే, ఇక్కడ వేలాది పక్షులను చూడవచ్చు,'' అన్నాడు మామయ్య.

వశాత్తూ ఫ్యాక్టరీ యజమానులు లాభాలపై చూపే శ్రద్ధ, జలకాలుష్యాన్ని అరికట్టడంపై చూపడం లేదు. అందుకు వాళ్ళు డబ్బు వెచ్చించడానికీ సిద్ధంగా లేరు,'' అన్నాడు తండ్రి.

''అయితే, దాన్ని ఆపడానికి ఏమీ చేయ లేమంటారా?'' అని అడిగింది లీల.

''ఇటీవల నదిని శుభ్రపరచమని సుప్రీం కోర్టు ఢిల్లీ ప్రభుత్వాన్ని ఆదేశించింది. ప్రభుత్వం ప్రస్తుతం యమునా కార్యాచరణ పథకాన్ని ప్రారంభించింది. అయినా ఈ విషయంలో చేయవలసింది ఇంకా చాలా ఉన్నది,''అన్నాడు మామయ్య.

''అక్కడ చూడండి!'' అని అరుస్తూ బ్రిడ్జ్ పై నుంచి వేగంగా వస్తున్న పాలిథీన్ సంచీని చూపింది లీల. అదృష్టవశాత్తూ అది వాళ్ళకు కాస్త దూరంలో పడడంతో అందరూ ఊపిరి పీల్చుకున్నారు.

**చందమామ లోకజ్ఞానం క్విజ్ -1 (ఫిబ్రవరి '09) సమాధానాలు**

1. ఏ రెండైనా; అంతకుపైన 2. మన దేశంలోని బ్రహ్మపుత్ర 3. టంగ్‌స్టన్
4. ది హోవర్ క్రాఫ్ట్ 5. వాల్టర్ హంట్ 6. ఎథ్నాల్ 7. పోలారిస్ 8. నైట్రస్ ఆక్సైడ్

గోపి అన్నిటినీ మౌనంగా వింటున్నాడు తప్ప, ఏమీ మాట్లాడలేదు. అతడి మనసులో ఏవేవో ఆలోచనలు. ఈ ప్రయాణం అతడి కళ్ళు తెరిపించినట్టయింది. ఇప్పుడు ప్రజల జీవితాన్నీ, నదులనూ అనుసంధానం చేసి చూడగలుగుతున్నాడు. శాంతపురంలో లాగా వ్యవసాయం, చేపలు, రవాణా, నిత్యావసరాలు అన్నింటితో నదుల అవసరం ముడిపడి ఉన్నది. అందువల్లే గ్రామస్థులు నదుల పట్ల అత్యంత శ్రద్ధ కనబరుస్తారు. అదే శ్రద్ధను యమునా నది మీద కూడా చూపాలి. అందుకు తన వంతు ఏదైనా చేసి తీరాలి.

''పిల్లలూ, ఓఖ్లా బ్యారేజీ చేరుకున్నాం. ఇక మనం దిగాలి,'' అన్నాడు మామయ్య పడవ తీరాన్ని తాకగానే. వాళ్ళు దిగుతూ ఉండగా గోపి దృష్టి, అక్కడ గుంపుగా ఉన్న కొందరు పిల్లల మీద పడింది. వాళ్ళల్లో కాస్త పెద్ద కుర్రాడు నీళ్లతో ఏదో చేస్తున్నాడు. గోపి అక్కడికి వెళ్ళి, ''ఏం చేస్తున్నారు మీరు?'' అని అడిగాడు ఆ కుర్రాణ్ణి.

''నా పేరు రమేష్. మేం పాఠశాల విద్యార్థులం. వివిధ ప్రాంతాలలో యమునా నదీ జలాల నాణ్యత ఎలా ఉందా అని నెల నెలా వచ్చి పరీక్షించి చూస్తాం. వారాంతాలలో వివిధ ప్రాంతాలకు వెళ్ళి ప్రజల మధ్య యమునా నదిని నిర్మలంగా ఉంచుకోవాలన్న స్పృహను వారిలో కలిగించడానికి కృషి చేస్తున్నాం,'' అన్నాడు వాడు.

యమునా నది పట్ల తన వంతు బాధ్యతను నిర్వర్తించడానికి తగిన అవకాశంగా దానిని భావించిన గోపి, ''మీ జట్టులో నన్ను కూడా చేర్చుకుంటారా?'' అని అడిగాడు.

''తప్పకుండా. ఆసక్తిగల వారు ఎవ్వరైనా చేరవచ్చు. సంతోషంగా స్వాగతిస్తున్నాం. రా, నా మిత్రులకు పరిచయం చేస్తాను,'' అన్నాడు రమేష్.

తన అబ్బాయీ, అతడి ఈడు పిల్లలూ సరికొత్త ప్రారంభానికి శ్రీకారం చుట్టారనీ, అటువంటి వాళ్ళ చేతుల్లో భూమి క్షేమంగా ఉండగలదనీ గోపి తండ్రి సంతోషిస్తూ, ఎంతో ఆప్యాయతతో వాళ్ళకేసి చూశాడు.



నైజీరియా జానపద కథ

# మహా బలశాలి

ఒక గ్రామంలో కండలు తిరిగిన షడూసా అనే బలశాలి ఉండేవాడు. ఒకసారి షడూసా తమ్ముడి ఎద్దుకు జబ్బు చేస్తే షడూసా దాన్ని తన భుజాల మీది కెత్తుకుని నదిని దాటి వైద్యుడి వద్దకు తీసుకు వెళ్ళాడు. ఆ ఎద్దు బిక్కు బిక్కు మంటూ కూర్చుని వెళ్ళడం చూసి గ్రామస్థులు అబ్బురంగా చెప్పుకున్నారు. దాంతో ఇంటికి తిరిగివచ్చిన షడూసా, ''ఈ గ్రామంలోనేకాదు; ప్రపంచంలో కెల్లా నేనే మహా బలశాలిని,'' అంటూ భార్య షేటూతో గొప్పలు చెప్పాడు.

''నువ్వు ఈ గ్రామంలో గొప్ప బలశాలిగా ఉండవచ్చు. ప్రపంచంలో నిన్నుమించిన బలశాలురు తప్పకుండా ఉంటారు,'' అన్నది భార్య.



షడూసాకు పట్టరాని ఆగ్రహం కలిగింది. ''ప్రపంచంలోకెల్లా నేనే మహా బలశాలిని. నన్ను మించిన వాడు లేడు,'' అని అరిచాడు.

షేటూ తన చెవులు మూసుకుంటూ, ''ఈ గ్రామంలో నువ్వు గొప్ప బలశాలివే. అయితే, ప్రపంచంలో నిన్ను మించిన బలశాలి ఉండి తీరుతాడు,'' అన్నది దృఢమైన కంఠస్వరంతో.

షడూసా కోపంతో తిండి కూడా ముట్టుకోకుండా ఇంటి నుంచి వెళ్ళిపోయాడు. తనను మించిన బలశాలి మరొకడు ఉన్నాడంటే ఏ బలశాలి మాత్రం సహించగలడు!

భర్త అనవసరమైన ఆవేశానికి నవ్వుకుంటూ షేటూ పక్క గ్రామంలో జరిగే సంతకు బయలు దేరింది. ఆమె బాట గుండా కొంత దూరం నడిచాక దాహం వేయడంతో ఒక బావి దగ్గర ఆగింది. బావిలోకి రాట్నం గుండా చేతాడు కనిపించింది. నీళ్ళలోపలి బొక్కెనను పైకి లాగబోయింది. కానీ దాన్ని అసలు కదిలించలేక ఉసూరుమంటూ బావిగట్టునే చతికిలబడింది.

సరిగ్గా, అదే సమయానికి తన మూడేళ్ళ కొడుకుతో అటుగా వచ్చిన ఒక స్త్రీ, షేటూ స్థితిని గమనించి, ''వెళ్ళి కాస్త బొక్కెనను చేది ఇవ్వు,'' అని కొడుకును పురమాయించింది. వాడేదో ఒక ఈకను తీసుకున్నంత సునాయాసంగా నీళ్ళలోని బొక్కెనను పైకి లాగి షేటూకు అందించాడు. ఆశ్చర్యంతో నోట మాట రాక దానిని చూస్తూన్న షేటూతో ఆ స్త్రీ, ''ఎందుకలా గుడ్లు మిటకరించి చూస్తున్నావు? నీళ్ళు తాగు. నా భర్త

ఈ ప్రపంచంలోకెల్లా మహాబలశాలి. అతడి తరవాతి బలశాలి నా కొడుకే!'' అని అంటూ వెళ్ళిపోయింది. షేటూ సంతకు వెళుతూన్న సంగతి కూడా మరిచిపోయి పరుగు పరుగున ఇంటికి తిరిగివచ్చి, ''షడూసా! ప్రపంచంలో కెల్లా మహాబలశాలి ఎవరో నాకిప్పుడు తెలిసింది,'' అన్నది.

అందిరి కన్నా ''నేనే మహా బలశాలి నని ఇప్పటికైనా ఒప్పుకున్నావే. చాలా సంతోషం,'' అన్నాడు షడూసా ఆనందంతో.



''నిన్ను గురించి ఇప్పుడెవరు చెబుతున్నారు? పక్క గ్రామంలో ఉంటున్న నిజమైన మహా బలశాలిని గురించే నేను చెప్పాను,'' అంటూ షేటూ జరిగినదంతా వివరించి చెప్పింది.

మరునాడు వేకువజామునే బయలుదేరి వెళ్ళిన షడూసా భార్య చెప్పిన బావి దగ్గరికి చేరి కూర్చున్నాడు. కొంత సేపటికే అతడి ఓర్పు నశించింది. పక్కనున్న రాతిని కాలితో తన్నాడు. అది ఎగిరి వెళ్ళి తొంభై గజాలకవతల పడింది. '' ఆహా! '' అంటూ చేతి కండరాలను గొప్పగా చూసుకుంటూ తల్లీకొడుకుల కోసం ఎదురు చూడసాగాడు. కొంతసేపటికి వాళ్ళు రానేవచ్చారు. అతన్ని చూడగానే, '' నీళ్ళు కావాలా,'' అని అడిగి అతడి స్పందనకు కూడా ఆగకుండా కొడుక్కి సైగచేసింది ఆస్త్రీ. కొడుకు చిటికెన వేలితో బొక్కెనను పైకి లాగాడు.

ఆ మాత్రం నేను లాగలేనా అనుకుంటూ షడూసా బొక్కెనను మళ్ళీ నీళ్లలోకి వదిలి చేతా డును లాగాడు. కదలలేదు. రెండు చేతులతో బలాన్నంతా కూడదీసుకుని లాగినా దానిని కది లించలేకపోయాడు. చెమటలు పోస్తూండగా, ''నీ కొడుక్కి ఇదెలా సాధ్యమయింది?'' అని అడిగాడు.

''నీ తండ్రి మహా బలశాలి అయినట్టయితే నువ్వూ లాగగలిగే వాడివే,'' అన్నది ఆస్త్రీ.

''నేను ఆయన్ను చూడవచ్చా?'' అని అడిగాడు షడూసా.

ఆ స్త్రీ అలాగే అన్నట్టు తలాడించి షడూసాను వెంటబెట్టుకుని బయలుదేరింది. ఒక ఇంటి ముందున్న పెద్ద ఎముకుల పోగును చూపుతూ, ''ఇవి మా ఆయన తిన్న పొద్దుటి ఫలహారంలో మిగిలినవి. ఏనుగు మాంసం అంటే ఆయనకు మహా ఇష్టం,'' అన్నది ఆ స్త్రీ.

చందమామ క్విజ్-1(ఫిబ్రవరి'09) విజేతలకు అభినందనలు

1. పోతూరి అరవింద్, కోనేరువీధి, పటమట-విజయవాడ-520010(ఆం.ప్ర)
2. రాజనారాయణ్, దానవాయిపేట, రాజమండ్రి-533103(ఆం.ప్ర)
3. ఎ.ఉదయాదిత్య, వీధి నంబరు:4, అశోక్‌నగర్, హైదరాబాద్-500020
4. మయూరి ఢాలే, తిలక్‌నగర్, నాందేడ్-431605

షడూసాకు రక్తం చల్లబడినట్టయింది. అప్పుడే ఇంట్లో నుంచి, ''నరవాసన వేస్తోంది. మధ్యాహ్న భోజనానికి ముందు నంజుకుతినడానికా,'' అన్న ఆనందపు కేక వినిపించింది.

షడూసా ఒక్క గెంతున పరుగులంకించుకున్నాడు. పడుతూ లేస్తూ వరిపొలాలలను సమీపించాడు. అక్కడి రైతులు అతడి కేసి వింతగా చూస్తూ, ''ఏమిటలా పరిగెడుతున్నావు?'' అని అడిగారు.

''మహాబలశాలి తరుముకు వస్తున్నాడు,'' అన్నాడు షడూసా. అతడు ఆ మాట పూర్తి చేయకముందే రైతులు పారలూ, పలుగులూ పడేసి పరుగులంకించుకున్నారు.

ఆ తరవాత వెనక్కు తిరిగి చూసిన షడూసా, ఎవరూ రాకపోయేసరికి ఊపిరి పీల్చుకుని, భారంగా అడుగులు వేయసాగాడు.

కొంత దూరం వెళ్ళాక మరో ఎముకల పోగు కనిపించగానే ఉలిక్కిపడ్డాడు. ''ఎక్కడికి వెళుతున్నావు?'' అని గద్దించి అడిగాడు పక్కనే కూర్చుని ఉన్న ఒక పర్వతాకారుడు. ''మహాబలశాలి నుంచి తప్పించుకోవడానికి పరిగెడుతున్నాను. అతడు వస్తున్నాడు!'' అన్నాడు షడూసా.

''అసంభవం! మహా బలశాలిని నేనొక్కడినే!'' అంటూ వికటాట్టహాసం చేశాడతడు.

అంతలో పెద్ద పెద్ద అంగలు వేసుకుంటూ అక్కడికి వచ్చిన మొదటి మహా బలశాలి, ''నా ఏనుగులను తినేంత ధైర్యం ఇక్కడ ఎవడికి ఉన్నది?'' అని అరిచాడు.

రెండవ బలశాలి బోరవిరిచి, బాదుకోసాగాడు. క్షణాల్లో ఇద్దరూ ద్వంద్వ యుద్ధానికి తలపడ్డారు. వాళ్ళు ఇంచుమించు పరస్పరం చంపుకున్నట్టయింది. అయితే ఉభయులూ సమఉజ్జీలు కావడంతో ఏ ఒక్కరూ చావలేదు. యుద్ధమూ ఆగలేదు. అలా యుద్ధం చేస్తూ గాలిలోకి పైకి లేచారు. కొంత సేపు అక్కడే పోట్లాడి ఒక్క గెంతుతో ఒక నల్లటి మేఘంలో జొరబడి ఆకాశంలోకి వెళ్ళిపోయారు.

షడూసా ఏళ్ళ తరబడి అక్కడే కాచుక్కూర్చున్నాడు. కానీ వాళ్ళు తిరిగి రాలేదు.

ఆఖరికి అన్నాళ్లు చెట్టు పైనే గడిపిన షడూసా చేసేది లేక నెమ్మదిగా చెట్టు దిగి ఇంటి ముఖం పట్టాడు.



ఇల్లు చేరగానే భార్య నవ్వుతూ ఎదురు వచ్చి, ''మహా బలశాలీ, వచ్చావా,'' అంటూ అతణ్ణి కౌగిలించుకోబోయింది.

''ఇక మరెన్నడూ నన్ను మహా బలశాలి అని పిలవద్దు,'' అన్నాడు షడూసా మెల్లగా.

యుద్ధం చేస్తూ ఆకాశానికి లేచిన వారు ఇంకా మేఘాల మధ్య పోట్లాడుకుంటూనే ఉన్నారనీ, వాళ్ళ కేకలే ఉరుములుగా వినిపిస్తున్నాయనీ కొందరు చెప్పుకుంటారు.




# తారీఖులు, వారాల మేధావి!




ఫలానా సంవత్సరం ఫలానా తేదీ ఏం వారం అని అడిగితే క్షణాలలో అతడు చెప్పగలడు. అది ఏ సంవత్సరం అయినా ఎలాంటి ఆధునిక పరికరాల సాయం లేకుండా సునాయాసంగా చెప్పగలుగుతున్నాడీ యువకుడు. తమిళనాడు విరుదునగర్‌కు చెందిన ఈ ఇరవై నాలుగేళ్ళ మారేష్ 60,000 సంవత్సరాల లోపు తారీఖులను, వారాలను చెప్పడానికి 1 నిమిషం 30 సెకన్లు మాత్రమే తీసుకుని ఇంత వరకున్న ఉత్తరప్రదేశ్ పవన్ కుమార్ శ్రీవాత్సవ 10.45 నిమిషాల రికార్డును బద్దలు కొట్టాడు. 92510వ సం. నవంబర్5వ తేదీ ఏం వారం అని అడిగినప్పుడు బుధవారం అని సరైన సమాధానం చెప్పడానికి 4.5 సెకన్లు మాత్రమే తీసుకున్నాడు. అందుకే అతడి పేరు లిమ్కా బుక్ ఆఫ్ వరల్డ్ రికార్డ్స్‌లో రెండవసారిగా చోటుచేసుకున్నది.

# దుర్యోధనుడి గుడులు!

మహాభారతంలో దుష్ట చతుష్టయంలో మొదటి వాడుగా చెప్పబడే దుర్యోధనుడికి గుడి ఉందంటే మీరు నమ్మగలరా? అయినా ఉన్నది. ఇది నిజం! ఉత్తర కాశి మోరీలో దుర్యోధనుడి గుడి ఉంది. కురువంశానికి చెందిన వారమని చెప్పుకునే వారు ఆ ఆలయంలో పూజలు జరుపుతున్నారు.

అంతే కాదు. భారత యుద్ధంలో కౌరవులు ఓడిపోయినందుకు స్థానిక ప్రజలు భోరున యేడ్చారనీ, వాళ్ళ కన్నీటితోనే తమసా నది ఏర్పడిందనీ, అదే ఇప్పుడు టోన్స్ నదిగా పిలువబడుతున్నదనీ కొందరు చెబుతారు. అందుకే కన్నీరు నిండిన ఈ నదీ జలాలను ఇప్పటికీ తాగడానికి ఉపయోగించడం లేదు. కేరళ రాష్ట్రం కొల్లం జిల్లా మలనాడులోని పొరువాళిలో కూడా దుర్యోధనుడికి గుడి ఉన్నది.



మన చరిత్ర పుటల నుంచి...

# తలక్కాడు శాపం

*క్రీ.శ. 1856 మార్చ్,*
తలక్కాడు-మైసూరు రాజ్యం

మారుతున్న ఇసుక తిన్నెల మీదుగా పరచుకున్న నీడల కావలనున్న గౌరీ శంకర ఆలయం మీద పడింది ఆయన దృష్టి. కొన్ని దశాబ్దాల క్రితం ఆయన తాత ముత్తాతలు రాజ్యంలోని ఇతర దేవాలయాలకులాగే ఆ ఆలయానికి కూడా అమూల్యమైన ఆభరణాలనూ, మణులు మాణిక్యాలనూ కానుకలుగా సమర్పించారు. ఆ కాలంలో తలక్కాడు ఇప్పటిలా ఇసుక మూసుకుపోయిన పాడుబడ్డ పట్టణం కాదు. జీవ ప్రదాయిని అయిన కావేరీ నదీ తీరంలో మైసూరు ఉడయార్‌లకు గర్వకారణంగా కళకళలాడుతూన్న సుసంపన్న నగరం...




''ప్రభూ!''

మంత్రి కంఠస్వరం వినబడగానే రాజా ముమ్మడి కృష్ణరాజ ఉడయార్ అటుకేసి తిరిగి చూశాడు.

''కలకత్తా నుంచి తమకేదైనా సందేశం అందినదా?'' అని అడిగాడు మంత్రి.

రాజా తన చేతిలో నలిగినట్టున్న ఉత్తరం కేసి చూశాడు.

''మైసూరు వారసత్వం గురించి డల్హౌసీ ప్రభువు చెబుతున్నదాన్ని చదువుతున్నాను విను: మైసూరు మహారాజా అయిన మీకు ఇప్పుడు అరవై రెండేళ్ళు. గత ఇరవై తరాలుగా ఇంతటి పండు వయసు వరకు మీరు మాత్రమే జీవిస్తున్నారు. ఆ సంగతి మీరే నాకు స్వయంగా చెప్పారు. అందువల్ల ఇంకా ఎంతో కాలం బతికి ఉండగలరని భావించలేము...''

మంత్రి తన చెవులను గట్టిగా మూసుకున్నాడు. ఒక్క క్షణం మౌనం వహించి, ''పాపం శమించుగాక! ఆయన చెబుతున్నది సరికాదని నిరూపించడానికి విశ్వాసపాత్రులైన ప్రభువుల అనుచరులు పలువురు సిద్ధంగా ఉన్నారన్న సంగతి ప్రభువులు మరవకూడదు. మైసూరులో బ్రిటిష్ రెసిడెంట్, కోర్ట్ ఆఫ్ డైరెక్టర్స్ అవసరమేం వచ్చింది?'' అన్నాడు బాధగా.

''నేనెప్పటికీ దత్తత స్వీకరించబోనని అందరూ అనుకుంటున్నారు. లేకుంటే ఇలాంటి అభిప్రాయం ఆయనకెలా తలెత్తుతుంది? అయినా వారసుడి

గురించి ఇంతకు ముందెన్నడూ నేను ఆలోచించ లేకపోవడం దయనీయం!'' అని నొచ్చుకున్న రాజా, ''కొన్ని సంవత్సరాలకు ముందే సొంత సంతానం కోసం ఎదురు చూడకుండా నేనొక వారసుణ్ణి ఎంపిక చేసి ఉండవలసింది. అధికా రాన్ని ప్రత్యక్షవారసులకు అప్పగించలేని మన వింత చరిత్ర జగద్విదితం కదా!'' అంటూ గాఢంగా నిట్టూర్చాడు.



''లార్డ్ డల్హౌసీ అమలు చేస్తూన్న ఈ 'డాక్ట్రిన్ ఆఫ్ ల్యాప్స్' వారసులు లేరనే సిద్ధాంతం మన రాజ్యం మీద అధికారం చూపదనే భావిస్తున్నాను. మైసూరు ఎల్లప్పుడూ ఉడయార్ పాలనలోనే కొనసాగాలి! అదే మా అందరి ఆకాంక్ష,'' అన్నాడు మంత్రి తన ఆగ్రహాన్ని అణచుకుంటూన్న కంఠస్వరంతో.

''ఆకాంక్ష బాగానే ఉన్నది. కానీ, బ్రిటిష్ రాజ్యంలో ఇతర సంస్థానాలు ఒక్కొక్కటిగా విలీనమై పోతున్నాయి కదా? ఆ వరుసలో తరు వాతిది మైసూరేనని మన ప్రజలకు కూడా తెలుసు,'' అన్నాడు రాజా.

''అసంభవం ప్రభూ! మైసూరును ధర్మ బద్ధులైన రాజులు పరిపాలించారు. ముందు ముందు కూడా అది కొనసాగాలి. కళాపోషకు లైన తమ అద్భుతమైన పాలనలో కళలు, సంస్కృతి మునుపెన్నడూ లేని విధంగా అభివృద్ధి చెందాయి,'' అన్నాడు మంత్రి.

''నీ ప్రభుభక్తికి సంతోషం. అయితే, 1830 రైతుల తిరుగుబాటు అనంతరం నేను స్వయంగా అధికారాన్ని బ్రిటిష్ వారికి అప్పగించిన తరవాత కూడా ఈ పాలన ఏదో మేలు చేయగలదు అని నువ్వు నిజంగానే భావిస్తున్నావా?'' అని అడిగాడు రాజా నిట్టూరుస్తూ.

''తమకు ముందు వనరులు దుర్వినియోగం అయినందుకు తమరినెలా బాధ్యులను చేయ గలరు? ఆ తరవాత, తగిన వారసులైన తమకే మైసూరు అప్పగించబడిందన్న సత్యాన్ని కాదన లేరు కదా?'' అన్నాడు మంత్రి.

కొంతసేపు మౌనం వహించిన రాజా, ''తలక్కాడు శాపం గురించి విన్నావా? లేదా?'' అని అడిగాడు మెల్లగా.

మంత్రి దగ్గుతూ, ''ఇలాంటి సమయంలో అలాంటి ఆలోచనలను తమ దరిచేరనివ్వకండి ప్రభూ! ప్రభువులు బాగా ఎరగినట్టు అదో కట్టుకథ,'' అన్నాడు.

రాజా సుదీర్ఘంగా సాగుతూన్న నీడలకేసి విచారంతో చూస్తూ, ''కొన్ని సందర్భాలలో కట్టు కథలే భీకర వాస్తవాలుగా గతం నుంచి మనలను వెన్నాడుతూ ఉంటాయి..'' అన్నాడు.

* * *

*(క్రీ.శ. 1610 మాళింగి (కావేరీ తీరం తలక్కాడుకు ఎదురుగా)*

అడవి మధ్య వేగంగా పరిగెత్తే అడుగుల చప్పుడు. ''ఆ దుండగుల చేతికి నేను పట్టుబడ కూడదు. రాజా ఉడయార్ చేతిలో పట్టుబడడం కన్నా చావడం మేలు ప్రభూ!'' అనుకుంటూ అలమేలమ్మ తరుముకువస్తూన్న సైనికులకు పట్టుబడకుండా చెట్ల చాటుగా పరిగెత్త సాగింది. నదిని సమీపిస్తూ ఒక చెట్టుకు గుద్దుకుంటూం



డగా ఆమె మనసులో మెరుపులాంటి ఆలోచన ఒకటి మెరిసింది. ఆమె భర్త రెండవ తిరుమల, విజయనగర ప్రతినిధి. అద్భుతమైన ఆయన పాలనలో శ్రీరంగపట్నం అత్యంత వైభవంతో వెలిగిపోయింది. అప్పుడే ఉడయార్ సేనతో వచ్చి, తన భర్త రాజ్యాన్ని ఆక్రమించాడు. దాంతో తానూ, భర్తా తప్పించుకుని మాళింగికి పారిపోవ లసిన నిర్బంధం ఏర్పడింది...

అలమేలమ్మ హృదయం తీరని బాధతో ఆక్రోశించింది. ఆమె ఒడిలో ఒకప్పుడు శ్రీరంగ పట్న మందిరంలోని విష్ణు విగ్రహాన్ని అలంకరిం చిన అమూల్య ఆభరణాలు ఉన్నాయి. అవి రాజా ఉడయార్ కైవసం కావడం ఆమెకు ఏమాత్రం ఇష్టం లేదు.

తను ప్రాణాలతో ఉన్నంత వరకు వాటిని వదిలిపెట్టకూడదనుకున్నది. వెనుక నుంచి వేగంగా రివ్వుమంటూ వచ్చిన ఒక బల్లెం పక్కగా దూసుకుపోయి నేలలో గుచ్చుకున్నది. శత్రు సైనికులు ఆమె ఉనికిని పసిగట్టి బల్లాన్ని విసిరారు. ఆమె ఒక్క గెంతున ముందుకు ఉరి కింది. తప్పించుకోవడం అసాధ్యమన్న పరిస్థితి...

చెట్ల మధ్యలో ఏదో కదలిక... గుడ్డిగా అటుకేసి ఆమె పరిగెత్తింది. గుర్రాల డెక్కల చప్పుడు స్పష్టంగా వినిపిస్తోంది. సుడులు తిరుగుతూ ప్రవహిస్తూన్న నదిని చూసింది. గొంతెత్తి, ''తలక్కాడు ఇసుకలో భూస్థాపితం అగుగాక! మాళింగి సుడిగుండంగా మారిపోనీ! మైసూరు పాలకులకు వారసులు కలుగకుండా పోదురుగాక!'' అని శపించి నదీ ప్రవాహంలోకి దూకేసింది!

సైనికులు అక్కడికి వచ్చేసరికి ఆమెతో సహా గుడి ఆభరణాలు కావేరిలో కలిసి పోయాయి! సైనికులు ఆశాభంగంతో వెనుదిరిగి వెళ్ళారు.

* * *



*క్రీ.శ 1865 జూన్ 18 (మైసూరు మహారాజా భవనం)*

మహారాజా ముమ్మడి కృష్ణరాజా ఉడయార్, రాజ భవనంలో మైసూరు డివిజన్ సూపరింటెండెంట్ చార్లెస్ ఇలియట్ సమక్షంలో గవర్నర్ జనరల్‌కు లేఖ రాస్తున్నాడు....

''నేను ఈ రోజు, హిందూ చట్టం ప్రకారం, మా పూర్వుల సంప్రదాయానుసారం మరియు మహారాణి ప్రకటనను అనుసరించి- 1799 ఈస్టిండియా కంపెనీ-నిజాంకు జరిగిన భాగస్వామ్య ఒప్పందం, దానికి లోబడిన అదే సంవత్సరం ఈస్టిండియా కంపెనీతో నేను కుదుర్చుకున్న ఉప ఒప్పందం ప్రకారం.. ప్రస్తుతం అమలులో ఉన్న ఉభయ అధికారాల ప్రకారం నాకున్న హక్కులన్నింటికీ వారసుడిగా ఒక కుమారుణ్ణి దత్తత తీసుకున్నాను..''

మైసూరు పాలకుడిగా ఆయనకు వారసు-డిగా తీసుకున్న రెండున్నర సంవత్సరాల బిడ్డ ఆయనకు బంధువు అయిన తొమ్మిదవ చామరాజ ఉడయార్.

సంవత్సరాల తరబడి సాగిన ఈ అనిశ్చిత పరిస్థితికి తెరపడింది. తన బాధ్యతను సక్రమంగా నెరవేర్చానన్న తృప్తి రాజుకు కలిగింది. 'డాక్ట్రిన్ ఆఫ్ ల్యాప్స్' నుంచి మైసూరు పరిరక్షించబడింది.

అన్నింటికీ మించి రాణి అలమేలమ్మ శాపం మళ్ళీ అడ్డుకోబడింది.

తలక్కాడు ఇసుకమేటలైపోయినా, మాళింగి కావేరీ నదిలో మునిగిపోయినప్పటికీ-మైసూరు సింహాసన వారసుడిగా మాత్రం చామరాజ ఉడయార్ నిలిచాడు!

**చారిత్రక అంశాలు:**

ముమ్మడి కృష్ణరాజ ఉడయార్ (1794-1868) కళాపోషణకు పేరుగాంచాడు. ఆయనకు వీణ వాయించడం వచ్చు. నాట్యం, సంగీతం మొదలైన కళలను పోషించాడు. ఆయన సంస్కృత, కన్నడ భాషలలో పండితుడు. ఆయనకు తెలుగు, తమిళం, మరాఠీ, హిందీ, పర్షియన్, ఇంగ్లీషు భాషలు చదవడం, రాయడం తెలుసు.

ఇక తలక్కాడు శాపం: రెండవ తిరుమల భార్య అలమేలు మంగమ్మ రాజా ఉడయార్ సైనికుల నుంచి తప్పించుకోవడానికి ప్రాణ త్యాగంచేస్తూ శపించిందని ఒక పూర్వగాథ చెబుతుంది. ప్రకృతి నిగూఢ వైపరీత్యాల కారణంగా మాళింగి కావేరీ నదిలో మునిగిపోయింది. తలక్కాడు ఈ నాటికీ ఇసుక మేటగానే మిగిలిపోయింది!

# వార్తలలో బాలలు

## కవలపిల్లల రికార్డు!




చాలామంది పిల్లలకు లెక్కలంటే భయం. అయితే ఏడేళ్ళ కవల పిల్లలయిన పౌలా, పీటర్ ఇమాఫిడాన్‌లకు లెక్కలంటే చెప్పలేనంత అభిమానం. తమ అసామాన్యమైన విన్యాసంతో ఈ కవలలు మూడు ప్రపంచ రికార్డులను బద్దలు కొట్టారు. ఎ-లెవెల్ లెక్కల పేపర్‌ను పాస్ చేసిన అతి పిన్న వయసు పాఠశాల విద్యార్థులు వీళ్ళు. ప్రపంచంలో కెల్లా ఇంతటి రికార్డు సృష్టించిన అతి పిన్నవయసు కవలలు కూడా వీళ్ళే.

ఇమాఫిడాన్ కుటుంబ ప్రతినిధి కిజ్జీ నెక్‌మోచా ప్రకారం, ''సంతోషంగా చదివే ఈ పిల్లలు గణితాన్నీ, విజ్ఞాన శాస్త్రాన్నీ చదవడం అన్నది శ్రమతో కూడుకున్న పనిగా కాకుండా ఒక సరదాగా, క్రీడగా తీసుకుంటున్నారు.''

పీటర్-పౌలాల ఐదుగురు పిల్లలూ చక్కగా చదివేవారే. ఈస్ట్ లండన్‌లోని జౌట్ స్కూల్లో చదువుతున్నారు.

## అతి పిన్న వయసు ఉపన్యాసకుడు

ఎనిమిదేళ్ళ పిల్లలు ఆడుకోవడానికి ఆసక్తి కనబరుస్తారు. అయితే, అమాన్ రెహ్మాన్ దీనికి మినహాయింపు! అతడు డెహ్రాడూన్ కాలేజ్ ఆఫ్ ఇంటరాక్టివ్ ఆర్ట్స్‌లో కంప్యూటర్ జెనరేటెడ్ యనిమేషన్ ఫిల్మ్ గురించి ఉపన్యాసాలిస్తున్నాడు. అతడే అతి పిన్న వయసు కాలేజీ లెక్చరర్లై ఉండవచ్చని అతడి కుటుంబీకులు భావిస్తున్నారు. మూడున్నరేళ్ళ వయసులోనే మొదటి యనిమేషన్ ప్రోగ్రామ్ చేసి డ్యాన్సింగ్ అక్షరాలతో చిత్రం రూపొందించాడు. దీనిని చూశాక మిత్రుల సలహా ప్రకారం అతడి తండ్రి అమాన్‌ను డెహ్రాడూన్‌కు తీసుకువెళ్ళాడు. కుర్రాణ్ణి ఒడిలో కూర్చోబెట్టుకుని చెప్పే ఆయన మాటలను నమ్మలేక కళాశాల అధికారులు నవ్వుకున్నారు!



తండ్రి ఒక వారం మంతనాల తరవాత తన బిడ్డను కంప్యూటర్ ముందు కూర్చోబెట్టి పరీక్షించడానికి అధికారులను ఒప్పించాడు. కుర్రాడి శక్తిసామర్థ్యాలను చూశాక, అతణ్ణి కళాశాలలో చేర్చుకోడానికి సమ్మతించారు. ఐదు నెలల్లో అమాన్ తన సొంత సాఫ్ట్‌వేర్ ప్రోగ్రామ్‌ను పూర్తి చేశాడు.

యురేకా:

# బెలూన్ జెట్



రాకెట్ వదలడం అంటే మీకు ఇష్టమా? ఇదిగో ఇక్కడ బెలూన్ రాకెట్ తయారు చేసే విధానం మీ కోసమే!

ఏమేం కావాలి?

పొడవైన దారం, తాగే స్ట్రా, సెలోఫేన్ టేప్, బెలూన్.



తయారు చేయడం ఎలా?

- దారం ఒక కొసను కిటికీ ఊచకుగానీ, తలుపు గొళ్ళానికి గానీ కట్టండి.
- దారం రెండవ కొసను స్ట్రా లోపలికి పోనివ్వండి.
- బెలూన్ను ఊది ఒక చేత్తో దాన్ని పట్టుకుని, వేరొకరి సాయంతో సెలోఫేన్‌తో దాన్ని స్ట్రా మీద అతికించండి.
- దారాన్ని వదులు లేకుండా బిగువుగా లాగి పట్టుకుని తరువాత బెలూన్ను వదిలి పెట్టండి.
- బెలూన్ జెట్‌లాగా ముందుకు దూసుకుపోతుంది.
- లోపల గాలి నిండుగా ఉన్నప్పుడు, సగం మాత్రమే ఉన్నప్పుడు బెలూన్ ఎంత దూరం వెళ్ళిందో కనుగొనండి.
- మీరు ఉపయోగించే దారాన్ని బట్టి బెలూన్ వేగం ఉంటుందా? మామూలు దారానికి బదులు గాలిపటం దారం ఉపయోగించి పరిశీలించి చూడండి.

కాన్సెప్ట్: బెలూన్ లోపలి గాలిలో ఒత్తిడి నిండి ఉంటుంది. అందువల్ల అది శక్తిని వెలువరించడంతో బెలూన్ వ్యాకోచిస్తుంది. బెలూన్ కూడా గాలిని తోస్తుంది. దాని ఫలితంగా తెరిచి ఉన్న మార్గం గుండా గాలి వేగంగా వెలుపలికి వస్తూ బెలూన్ను ముందుకు తోస్తుంది. ఈ జెట్ కూ, రాకెట్‌కూ మధ్య ఉన్న తేడా ఏమిటంటే– రాకెట్లో, గాలి/గ్యాస్ రాకెట్టుకు వెనకవైపున ఉన్న నాజిల్ గుండా, వెలుపలికి చిమ్మబడుతుంది. అది చక్కటి నియంత్రణలో ఉంటుంది గనక, ఎక్కువ దూరం వెళ్ళడానికి వీలవుతుంది. మరింత మెరుగైన నియంత్రణలో ఉంటుంది.






# గ్రాండ్ స్లామ్ విజేతలు

జనవరి-ఫిబ్రవరిలో మెల్‌బోర్న్‌లో నిర్వహించిన ఆస్ట్రేలియన్ ఓపెన్‌లో ఇండియా తన సామర్థ్యాన్ని ప్రదర్శించింది. 'బాయ్‌వండర్'గా అభివర్ణించబడ్డ భంబ్రి, జర్మనీకి చెందిన అలెగ్జాండ్రోస్-ఫెర్డినాండోస్ జార్గోడాస్‌ను 6 - 3, 6 - 1 స్ట్రెయిట్ సెట్స్‌లో ఓడించి ఫైనల్ జూనియర్ టెన్నిస్ ఛాంపియన్ షిప్‌ను కైవసం చేసుకున్నాడు. ఢిల్లీకి చెందిన ఈ పదహారేళ్ళ కుర్రాడు 2007 ఆస్ట్రేలియన్ ఓపెన్‌లో సెమీఫైనల్‌కు చేరుకున్నాడు.

ఇండియాకు చెందిన సానియా మీర్జా-మహేష్ భూపతి జంట ఆస్ట్రేలియన్ ఓపెన్‌లో మిక్సెడ్ డబుల్స్ గ్రాండ్‌స్లామ్ సాధించి టెన్నిస్ అభిమానులను అలరించారు. వాళ్ళు ఇజ్రాయెల్‌కు చెందిన యాండీ ర్యామ్; ఫ్రాన్స్‌కు చెందిన నాథలీడెకీని 6 - 3, 6 - 1లో ఓడించారు. సానియాకు ఇది మొట్టమొదటి గ్రాండ్‌స్లామ్; భూపతి ఇంతకు ముందు 10 గ్రాండ్‌స్లామ్‌లు గెలుపొంది ఉన్నాడు.

# క్రికెట్ ద్వారా ప్రపంచ రికార్డులు







ఒన్ డే క్రికెట్‌లో ఇండియన్ కేప్టన్ మహేంద్రసింగ్ ధోనీ 4,019 పరుగులు, 165 వికెట్‌లు ఒక విలక్షణ మైన డబుల్ రికార్డ్. జనవరి 31వ తేదీ శ్రీలంక కొలంబోలో ఆడినప్పుడు అతడీ రికార్డు నెలకొల్పాడు.

శ్రీలంకకు చెందిన ముత్తయ్య మురళీధరన్ ఒడిఐలలో హైయెస్ట్ వికెట్ కీపర్. ఇండియాతో శ్రీలంక కొలంబోలో ఆడిన నాలగవ ఒడిఐలో ఈ రికార్డును సృష్టించాడు. టెస్ట్ మేచస్‌లో అత్యధిక విక్కెట్లు (769) తీసిన ప్రత్యేకతను కూడా సంతరించుకున్నాడు.



# వైరాగ్యం

బ్రహ్మదత్తుడు కాశీరాజ్యాన్ని పరిపాలించే కాలంలో విదేహ దేశానికి ముఖ్యపట్టణమైన మిథిలానగరంలో మహాజనకుడనే రాజు ఉండేవాడు. ఆయనకు అరిష్టజనకుడని, పోలజనకుడని ఇద్దరు కుమారులుండేవారు.

మహాజనకుడు పోయాక అరిష్టజనకుడు రాజ్యాభిషేకం చేసుకుని రాజై, తన తమ్ముడైన పోలజనకుణ్ణి యువరాజు చేశాడు. అయితే, కొంతకాలానికి అరిష్టజనకుడికి తన తమ్ముడు తనను చంపి రాజు కావాలని చూస్తున్నట్టు నౌకర్ల ద్వారా రహస్య వార్తలు అందాయి. కాని అరిష్టజనకుడు వాటిని లక్ష్యపెట్టలేదు.

తన అన్న అలక్ష్యం ఆధారం చేసుకుని పోలజనకుడు కొంత పరివారాన్ని కూడగట్టుకుని, అన్నపై కుట్ర పన్ని ఒకనాడు హఠాత్తుగా వెళ్ళిపడి ఆయనను హత్య చేసేశాడు.

అరిష్టజనకుడు చనిపోయే సమయానికి ఆయన పట్టపురాణి గర్భవతిగా ఉన్నది. భర్త చనిపోయిన వార్త వినగానే ఆమె తన నగలూ నాణ్యాలూ ఒక గంపలో పెట్టి, వాటిపైన ఊక కప్పింది. తరవాత ఆమె మాసిన బట్టలు కట్టుకుని, గంప నెత్తిన పెట్టుకుని బయలుదేరింది. దారిలో ఆమె నెవరూ గుర్తించలేదు. ఆమె ఉత్తర ద్వారంగుండా నగరం దాటి వచ్చేసింది:

ఎటు వెళ్ళాలో ఆమెకు తెలియలేదు. ఆమె ఎన్నడూ రాజసౌధం దాటి ఇవతలికి వచ్చిన మనిషి కాదు. కాలచంప అనే నగరం ఒకటి ఎక్కడో ఉన్నట్టు ఆమె విని ఉన్నది. అందుచేత ఆమె ఒక చెట్టు కింద తన గంప పెట్టుకు కూచుని, దారి వెంట వచ్చే పోయే వారిని, ''కాలచంప నగరానికి దారి ఎటు, నాయనా?'' అని అడగసాగింది.

కొంత సేపటికి ఒక ముసలివాడు బండి తోలుకుంటూ అటుగా వచ్చాడు. వాడు రాణితో, ''నేను ఆ నగరానికే పోతున్నాను.

జాతక కథ



"నాయనా, నేను మిథిలా నగరపు రాణిని. నా భర్త యుద్ధంలో చనిపోవటం వల్ల నేను దిక్కు లేని అనాథనై పోయాను. నా కిప్పు డెవరూ లేరు. ఈ నగరంలో నే నెవరినీ ఎరుగను," అన్నది రాణి బ్రాహ్మణుడితో.

"అలా అయితే, నువ్వు మా ఇంట తల దాచుకోవచ్చు. కాని ముందుగా ఒక చిన్న నాటకం ఆడాలి. నా కాళ్ళ మీద పడి, బయట ఉన్న నా శిష్యులు వినేటట్టు భోరుమని శోకాలు పెట్టు. నీ రహస్యం ఎవరికీ తెలియ కుండా నిన్ను కాపాడుతాను," అన్నాడు బ్రాహ్మణుడు.

రాణి ఆయన చెప్పినట్టే చేసింది. ఎవరో స్త్రీ తమ గురువుగారి కాళ్ళ మీద పడి బావురు మనటం చూడగానే శిష్యులు ఆత్రంగా లోపలికి వచ్చి, "ఏమిటి? ఏమిటి?" అని ప్రశ్నించారు. దారే పొయ్యే వారు కూడా చాలా మంది చేరారు. బ్రాహ్మణుడు వారితో, "ఈమె నా కడగొట్టు చెల్లెలు. నేను స్వగ్రామం విడిచిపెట్టాక పుట్టింది. అందుచేత ఈమెను నేనింతకు ముందెన్నడూ చూసి ఎరుగను," అని చెప్పాడు. ఈ మాటలను అందరూ నమ్మారు.

బ్రాహ్మణుడు ఆమెను తన ఇంటికి తీసుకుపోయి, చక్కగా స్నానం చేయించి, భోజనం పెట్టించాడు.

కొద్ది రోజులకల్లా ఆమె ఒక మగపిల్లవాణ్ణి కన్నది. ఆ పిల్లవాడి కామె మహాజనకుడని తన మామగారి పేరు పెట్టుకున్నది. ఈ మహాజన కుడే బోధిసత్వుడు.

బండి ఎక్కి కూచో అమ్మా. నిండు చూలాలు లాగా ఉన్నావు. బండి జాగ్రత్తగా, కుదుపు ల్లేకుండా తోలుతాలే," అన్నాడు.

రాణి ఆ బండిలో ఎక్కి కాలచంప నగ రానికి చేరుకున్నది. బండివాడు ఆమెను ఒక చావడివద్ద దించి వెళ్ళి పోయాడు. ఇక ఎక్క డికి వెళ్ళాలో ఆమెకు తెలియలేదు. అందు చేత ఆమె ఆ చావడిలోకి వెళ్ళి కూచుని, దాని ముందుగా నడిచే మనుషులను చూడ సాగింది.

కొంత సేపటికి ఒక బ్రాహ్మణుడు తన శిష్యులతో సహా స్నానానికి వెళుతూ చావడిలో బిక్కు బిక్కుమని కూర్చుని ఉన్న గర్భిణి స్త్రీని చూశాడు. ఆయన తన శిష్యులను బయటనే ఉండమని, లోపలికి వచ్చి రాణిని పలక రించాడు.

మహాజనకుడు క్రమంగా పెరిగి పెద్దవాడు కాసాగాడు. అతనితో ఆడుకునే క్షత్రియ కుమారులు అతన్ని చులకనగా చూసేవాళ్ళు. ఇది చూసి మహాజనకుడు మండిపడి వాళ్ళను చితక తన్నేవాడు. వాళ్ళు ఏడుస్తూ వెళ్ళి తమ పెద్దవాళ్ళతో, ''ఆ విధవరాలి కొడుకు మమ్మల్ని తన్నాడు!'' అని చెప్పేవాళ్ళు.

''విధవరాలి కొడకు,'' అన్న మాట వినగానే మహాజనకుడుకి తన తండ్రి ఎవరా అని సందేహం కలిగింది. మొదట్లో తల్లి అతనికి నిజం చెప్పలేదు. కాని మహాజనకుడు పట్టు బట్టడంతో ఇక చేసేదిలేక ఆమె జరిగినదంతా కొడుక్కు చెప్పేసింది.

తన పినతండ్రి తన తండ్రితో యుద్ధం చేసి, యుద్ధంలో తన తండ్రిని చంపి విదేహరాజ్యం వశపరచుకున్నాడని తెలియగానే, ఆ రాజ్యం తిరిగి సాధించాలన్న కోరిక మహాజనకుడికి మనసులో తల ఎత్తింది. పదహారేళ్ళు నిండగానే అతను తన చదువు సంధ్యలు ముగించి, తల్లితో, ''అమ్మా, నేను విదేహ రాజ్యాన్ని జయిస్తాను. నీ దగ్గిర సొమ్మేమైనా ఉన్నదా?'' అని అడిగాడు.

ఆమె అతనికి తాను గంపలో దాచి మిథిలా నగరం నుంచి తెచ్చిన బంగారమూ, నగలూ చూపింది. అందులో సగం మాత్రమే తీసుకుని మహాజనకుడు మిథిలా నగరానికి ప్రయాణమయ్యాడు.

ఆరోజే మిథిలా నగరంలో పోలజనక మహారాజుకు ఒక చెయ్యీ, కాలూ పడిపోయింది. సరిగ్గా మహాజనకుడు మిథిలా నగరంలో అడుగు పెట్టిననాడే రాజభవనంలో పోలజనకుడు మరణించాడు.

ఆయనకు వారసులెవరూ లేరు. రాజ పురోహితుడు ఒక రథం మీద రాజకిరీటమూ,



రాజఛత్రమూ, రాజదండమూ, పాదుకలూ మొదలైనవి పెట్టి రథాన్ని యథేచ్ఛగా పోని చ్చాడు. పురోహితుడూ, మంత్రులూ రథం వెనక నడుస్తూ బయలుదేరారు.

రథం కొంతదూరం వెళ్ళి, ఉద్యాన వనంలో మహాజనకుడు విశ్రాంతి తీసుకుంటున్న చోట ఆగిపోయింది.

రాజపురోహితుడు మహాజనకుణ్ణి పరీ క్షించి అతని శరీరంపైన రాజలక్షణాలుండటం గమనించి, విదేహ దేశానికి అతన్ని రాజుగా ప్రకటించాడు. అతనికి పట్టాభిషేకం జరి గింది. తరవాత మహాజనకుడు సీవలీదేవిని పెళ్ళాడి, సుఖంగా రాజ్యం చేయసాగాడు. వారికి దీర్ఘాయువు అని ఒక కుమారుడు కూడా కలిగాడు.

కొంతకాలం గడిచింది. ఒకరోజు మహాజన కుడికి తోటలు చూడాలని వేడుక కలిగింది. ఆయన తన ఏనుగు నెక్కి తోటలు చూడటా నికి బయలుదేరాడు. తోటలోకి ప్రవేశిస్తూనే ఆయన రెండు అందమైన గున్న మామిడి చెట్లను చూశాడు. అవి గుబురుగా, నవనవ లాడుతూ ఉన్నాయి. వాటిలో ఒక చెట్టు నిండా పళ్ళున్నాయి. ఆ చెట్టు మీద రకరకాల పక్షులున్నాయి. రెండవ చెట్టుమీద ఒక్క పండు కూడా లేదు. పళ్ళున్న చెట్టు నుంచి ఒక పండు కోయించుకుని తిని, అది చాలా రుచిగా ఉండటం చేత రాజుగారు, తిరిగి వచ్చేటప్పుడు మరి కొన్ని పళ్ళు తిందామని తన మనసులో అనుకున్నాడు.

ఆయన ముందుకు సాగి వెళ్ళగానే రాజు గారి పరివారంలో వారంతా ఆత్రంగా మామిడి పళ్ళు కోసుకుని తిన్నారు. కొందరు తొంద రలో రెమ్మలు కొమ్మలు కూడా విరిచారు. అంతవరకు ఎంతో అందంగా ఉండిన గున్న మామిడి కొద్ది క్షణాలలో బీభత్సంగా అయి పోయింది.

రాజుగారు తోటలన్నీ కలియతిరిగి, తిరిగి వస్తూ పాడుపడిపోయిన మామిడి పళ్ళ చెట్టును చూసి నిర్ఘాంతపోయాడు. దాని పక్కనే ఉన్న గొడ్డుమామిడి చెట్టు ఏమాత్రం చెక్కు చెదరకుండా ఎప్పటిలాగే నవనవ లాడుతూ ఉంది. (ముగింపు వచ్చే సంచికలో)






# రామాయణం

సేతువు నిర్మించమని రాముడు ఆనతి ఇవ్వగానే లక్షల సంఖ్యలో వానరులు అరణ్యాలకు పోయి, సాలవృక్షాలనూ, అశోక వృక్షాలనూ, బిల్వ వృక్షాలనూ, మామిడి చెట్లనూ, ఇంకా అనేక రకాల చెట్లనూ పీకి తెచ్చి సముద్రం పైన వేశారు. తాటి, కొబ్బరి, తుమ్మ, పొగడ మొదలైన చెట్లను కూడా తెచ్చి సముద్రం మీద విసిరి వేశారు. ఏనుగులంతేసి కొండ రాళ్ళను యంత్ర సహాయంతో చేర్చారు. సేతువు సమంగా ఉండేటట్టు చూడటానికి కొందరు తాళ్ళు పట్టుకున్నారు, కొందరు కర్ర బద్దలు పట్టుకున్నారు, కొందరు కర్ర హెచ్చు తగ్గులు పరీక్షించారు. ఈ విధంగా వానరులు పది ఆమడలు వెడల్పూ, నూరు ఆమడలు నిడివీ గల సేతువును నిర్మించారు.

నళుడి ఆధ్వర్యంలో వారు మొదటి రోజు పధ్నాలుగామడలూ, రెండవ రోజు ఇరవై ఆమడలూ, మూడో రోజు ఇరవై ఒక్క ఆమడలూ, నాలుగో రోజు ఇరవై రెండామడలూ, అయిదో రోజు ఇరవై మూడామడలూ సేతువు నిర్మించి, అయిదు రోజులలోగా సువేలపర్వతాన్ని చేరుకున్నారు. వానరులు సంతోషంతో గెంతుతూ, అరుస్తూ, కోట్ల సంఖ్యలో సముద్రాన్ని సేతువు మీదుగా దాటి సముద్రపు దక్షిణ తీరాన్ని చేరుకున్నారు.

విభీషణుడొక గద తీసుకుని, శత్రువులెవరైనా వస్తే హతమార్చటానకి సిద్ధంగా తన మంత్రులతో ఆ దక్షిణతీరాన నిలబడి ఉన్నాడు.

రామలక్ష్మణులను హనుమంతుడూ, అంగదుడూ భుజాల మీద ఎత్తుకుని వారధి

యుద్ధకాండ – 4



రకరకాల ధ్వజాలతోనూ, పతాకలతోనూ కూడి ఉన్న లంకానగరాన్ని చూసి రాముడు, ''ఇక్కడనే గదా సీత జింకపిల్ల లాగా రావణుడి నిర్బంధంలో ఉన్నది !'' అని దిగులుగా అనుకుని, లక్ష్మణుడితో, ''ఆ త్రికూట పర్వతం మీద విశ్వకర్మ నిర్మించిన లంకానగరాన్ని చూడు. అనేక పెద్ద భవనాలతో ఇది తెల్లని మబ్బులుగల ఆకాంశలాగున్నది. మంచి మంచి సుందర వనాలతో అందంగానూ, రకరకాల పక్షుల కూతలతో ఎంతో ఆహ్లాదకరంగానూ ఉన్నది,'' అన్నాడు.

తరవాత రాముడు వానర సేనను గరుడ వ్యూహంలో అమర్చి, దానికి ముందు తానూ, లక్ష్మణుడూ ఉండేట్టూ, అంగదుడు నీలుడితో బాటు తన సేనతో సహా హృదయ స్థానంలో ఉండేటట్టూ, ఋషభుడు తన సేనతో కుడి పక్కా, గంధమాదనుడు ఎడమ పక్కా ఉండేటట్టూ, జాంబవంతుడూ, సుషేణుడూ, వేగదర్శి కడుపుస్థానంలో ఉండే విధంగా, సుగ్రీవుడు వెనుకభాగాన్ని రక్షించేట్టూ ఏర్పాటు చేశాడు.

వ్యూహం ఏర్పాటు కాగానే రాముడి ఆజ్ఞపై సుగ్రీవుడు శుకుణ్ణి బంధవిముక్తుణ్ణి చేశాడు. వాడు అక్కడ క్షణమైనా ఉండక రావణుడి దగ్గిరికి వెళ్ళాడు. రావణుడు వాణ్ణి చూసి, ''ఎవరో నీ రెక్కలు విరిచినట్టున్నారు. నువ్వు కోతులకు చిక్క లేదు కద?'' అన్నాడు.

''నేను సముద్రం దాటి వెళ్ళి, సుగ్రీవుణ్ణి చూసి, తమరు చెప్పమన్నట్టుగానే చెప్పాను. ఆ వానరులు నన్ను చూసి మండిపడి,

దాటించారు. అక్కడ అందరూ రాముడికి వేరువేరుగా మంగళాభిషేకం చేశారు. వార తన్ని శత్రువులందరినీ సంహరించి, చిర కాలం భూమండలమంతా ఏలవలసిందని మంగళవాక్యాలతో ఆశీర్వదించారు.

రాముడు లక్ష్మణుడితో, '' మనం ఆలస్యం చెయ్యరాదు. వెంటనే లంకకు బయలుదేరి పోదాం,'' అన్నాడు. రాముడు ధనుర్ధారి అయి ముందు నడుస్తూంటే వానరసేన వెనకగా కదిలింది. విభీషణ, సుగ్రీవాది ప్రముఖులు సింహనాదాలు చేస్తూ కదిలారు.

ఇక్కడ వానర సేన విడియగానే లంకలో నుంచి భేరి మృదంగ ధ్వనులు భయంకరంగా వినవచ్చాయి. వాటిని విని వానరులు అంతకన్న గట్టిగా సింహనాదాలు చేశారు. ఆ ధ్వనిని లంకలోని రాక్షసులు విన్నారు.



ఆకాశంలోకి ఎగిరి నన్ను పట్టుకుని, నానా హింసలూ పెట్టి, చంపటానికి సిద్ధపడ్డారు. వాళ్ళు అమిత కోప స్వభావులూ, క్రూరులూనూ. వాళ్ళతో మాట్లాడటమే కష్టం, ఇంక జవాబు చెప్పించటం ఎట్లా? రాముడు లంకాద్వీపానికి చేరాడు. సముద్రానికి సేతువు నిర్మించి లంకాద్వారం దాకా వచ్చాడు. వానర సేనలు ఇసుక వేస్తే రాలకుండా ఉన్నాయి. వెంటనే సీతను రాముడి కిచ్చెయ్యటమో, యుద్ధానికి సిద్ధం కావటమో, ఏదో ఒకటి చెయ్యాలి,'' అన్నాడు శుకుడు.

రావణుడు శుకుడితో తాను యుద్ధానికే నిశ్చయించుకున్నట్టు చెప్పి, వానర సేన వివరాలన్నీ రహస్యంగా తెలుసుకు రమ్మని శుకసారణులను పంపాడు. వారు వానర రూపాలు ధరించి వానరసేన ప్రవేశించారు.

వాళ్ళకు వానర సేన అంతు చిక్క లేదు. పర్వత శిఖరాల మీదా, పర్వతాల మధ్యా, అరణ్యాలలో, సముద్రతీరానా, వనాలలో, ఉద్యానాలలో ఎక్కడ చూసినా వారికి వానర సేన కనిపించింది. ఆ సేనలో ఒక భాగం ఇంకా సేతువు దాటుతూనే ఉన్నది!

ఇంతలో శుకసారణుల మాయా రూపాలను విభీషణుడు పోల్చుకుని, వారిని పట్టుకుని రాముడితో, ''వీళ్ళు శుకసారణులనే వారు. రావణుడి మంత్రులు. మన రహస్యాలు తెలుసుకు పోవటానికి లంక నుంచి వచ్చారు,'' అని చెప్పాడు. రావణుడు పంపగా వానర సేనను గురించి తెలుసుకోవటానికి వచ్చినట్టు శుకసారణులు ఒప్పుకున్నారు.

రాముడు నవ్వుతూ, ''ఇక నేం? సైన్యమంతా చూసుకోండి. మమ్మల్ని చూడండి. చూడవలసిన దంతా చూశాక స్వేచ్ఛగా లంకకు వెళ్ళిపొండి,'' అని వారితో అన్నాడు. వాళ్ళు నిరాయుధులు కనక వారిని చంపనని కూడా అతనన్నాడు. అతను రావణుడితో తన మాటలుగా ఇలా చెప్ప మన్నాడు: ''నువ్వు ఏ ధైర్యంతో నా భార్య సీతను అపహరించావో ఆ ధైర్యాన్ని ఇప్పుడు ప్రదర్శించు. రేపు తెల్లవారుతూనే లంకా ప్రాకారాన్నీ, ద్వారాలనూ, నీ రాక్షస సైన్యాన్నీ నా బాణాలతో నుగ్గు చెయ్యబోతున్నాను. జాగ్రత్త!''

శుకసారణులు లంకకు తిరిగి వెళ్ళి రావణుడితో, ''రాజా, మేము వానర సేనలో ప్రవేశించి విభీషణుడికి పట్టుబడ్డాం. అయితే ధర్మాత్ముడైన రాముడు మమ్మల్ని విడిచి పెట్టాడు.



వానర సేనకు రాముడూ, లక్ష్మణుడూ, విభీషణుడూ, సుగ్రీవుడూ చాలు–వారు పరాక్రమంలో దేవేంద్రుడికి తీసిపోరు. రాముడి రూపమూ, ఆయుధాలూ చూస్తే అతనొక్కడే చాలు, లక్ష్మణ విభీషణ సుగ్రీవులెందు కనిపిస్తుంది. ఇక వానర వీరులు యుద్ధోత్సాహులై, ఎప్పుడా అన్నట్టున్నారు. అందుచేత వాళ్ళతో విరోధం పెట్టుకోవటం కన్న వెంటనే సీతను రాముడి కిచ్చెయ్యటం మంచిది,'' అన్నారు.

ఈ మాటలు విని రావణుడు సారణుడితో, ''అన్ని లోకాలూ ఒక్క పెట్టున నా పైకి ఎత్తివచ్చి భయపెట్టినా నేను సీతను పోనివ్వను. నువ్వు మెత్తని వాడవు కావటం చేత వానరుల దెబ్బలకు బెదిరిపోయి సీత నిచ్చెయ్యమంటున్నావు,'' అని, శుకసారణులను వెంటబెట్టుకుని మంచు కొండలాటి తెల్లని తన భవనం పైకి ఎక్కి, అక్కడినుంచి కనిపించే పర్వతాలూ, వనాలూ, సమస్తమూ వానర సేనతో నిండి ఉండటం గమనించాడు.

అతను సారణుడికేసి తిరిగి, ''వానరులలో అగ్రనాయకు లెవరు? ముఖ్యులెవరు?'' అని అడిగాడు.

''లంక కేసి తిరిగి సింహనాదం చేస్తున్న ఆ వానరుడు నీలుడు; వానర సేనా నాయకుడు, చేతులు పైకెత్తి నిలబడి, తోకను నేల కేసి కొట్టుతున్న వాడు అంగదుడు; సుగ్రీవుడి చేత యువరాజుగా అభిషేకం చేయించుకున్నవాడు; వాలి కొడుకు. హనుమంతుడు లంకకు వచ్చి సీతను చూసిన వాడే. అంగదుడికి వెనకగా ఉన్నవాడు నళుడు; అతనే సముద్రానికి సేతువు కట్టినది! సైనికులను సర్దుతూ, ఉత్సాహపరుస్తూ తిరిగే ఆ తెల్లని వానరుడు హాశ్వేతుడు. అడుగో, అతను కుముదుడు, చాలా తీవ్రస్వభావం గలవాడు, భయంకరుడు. ఆ వానరుడు రంభుడు. అవులించే వాడు శరభుడు; అని చెబుతూ సారణుడు రావణుడికి ఒక్కొక్క వానర ప్రముఖుణ్ణీ పరిచయం చేశాడు. సారణుడు చెప్పేది పూర్తి అయ్యాక, శుకుడు మరి కొందరు శత్రు ప్రముఖుల గురించీ, వారి ఘనతను గురించీ రావణుడికి వివరించి చెప్పాడు.

తన మంత్రులు శత్రువీరులను ఆవిధంగా తెగ పొగడటం విని రావణుడికి ఆగ్రహం కలిగింది. అతను వారితో, ''నా ఉప్పు తిని బతికే వాళ్ళు నాకు అప్రియంగా ఇలా

మాట్లాడవచ్చా? ఒక వంక యుద్ధం జరగ బోతుండగా శత్రువుల నిలా పొగడవచ్చా? పెద్దల దగ్గిర మీరేం నేర్చుకున్నట్టు? మీరు చదివిననీతి శాస్త్రమంతా ఏమైనట్టు? మిమ్మల్ని చంపెయ్యవలిసిందే, కాని మీరులోగడ చేసిన మేలుతలచి మిమ్మల్ని విడిచి పెట్టేస్తున్నాను. అదే మీకు మృత్యువుతో సమానం,'' అన్నాడు.

ఈ మాటలకు సిగ్గుపడి, శుకసారణులు రావణుడికి జయం పలికి వెళ్ళిపోయారు. రావణుడు మహోదరుడనే వాణ్ణి పంపి వేగుల వాళ్ళను పిలిపించి వారితో, ''మీరు రాముడి వద్దకు వెళ్ళి, అతని ప్రయత్నాలేవో, అతని అంతరంగికులెవరో తెలుసుకోండి. రాముడు ఎప్పుడు పడుకుంటాడో, ఎప్పుడు మేలుకుం టాడో, ఏంచేస్తాడో, సమస్తమూ తెలుసుకు రండి. మీరు తెలుసుకు వచ్చే విషయాలు యుద్ధంలో మనం సులువుగా గెలవటానికి సహాయం కావాలి,'' అన్నాడు.

ఆ చారులు-శార్దూలుడనే వాణ్ణి వెంట బెట్టుకుని, మారు రూపాలతో, సువేల పర్వత సమీపంలో రామ లక్ష్మణులున్న చోటికి చేరు కున్నారు. రామలక్ష్మణులనూ, వానర సేననూ చూడగానే వారికి భయం వేసింది.

విభీషణుడు వాళ్ళను పోల్చనే పోల్చాడు. వారిలో శార్దూలుడు మరీ దుష్టుడు. విభీ షణుడు చారులను పట్టుకుని, శార్దూలుణ్ణి వానరులకు అప్పగించాడు. వానరులు వాణ్ణి చంపబోతుంటే రాముడు అడ్డుపడి, శార్దూ లుణ్ణీ, మిగిలిన చారులనూ కూడా విడిపిం చాడు. వారు లంకకు తిరిగి వెళ్ళి, రాముడు సేనతో సహా సువేల పర్వతప్రాంతంలో ఉన్నాడని రావణుడికి చెప్పారు.



రావణుడు శార్దూలుణ్ణి చూసి, ''నీ ముఖం అలా వాడి ఉన్నదేమిటి? శత్రువులు నిన్నేమీ చెయ్యలేదు గద?'' అని అడిగాడు.

శార్దూలుడు రావణుడితో, ''ఆ వానరుల మీద వేగు చెయ్యటం చాలా కష్టం. నేను వానర సేనలో ప్రవేశించానో లేదో, నన్ను పట్టుకున్నారు. విభీషణుడి మంత్రులునన్ను హూనం చేసేశారు. ఆ తరవాత వానరులు నన్ను పొడిచి, కరిచి, కొట్టి చాలా విధాల బాధించారు. నేను రక్తంకారి, స్పృహతప్పి, చావటానికిసిద్ధంగా ఉండగా రాముడు నన్ను దయతలచి కాపాడాడు. అతను త్వరలోనే లంకను ముట్టడించనున్నాడు. ఇచ్చావా సీతను ఇచ్చెయ్యి, లేదా యుద్ధానికిసిద్ధంకా!'' అన్నాడు.

రావణుడు శార్దూలుడి చేత కూడ వానర ప్రముఖులను గురించి చెప్పించుకుని, తన మంత్రులను పిలిపించి వారితో కార్యాలోచన చేశాడు. అతను కర్తవ్యం నిర్ణయించుకుని, మంత్రులను పంపేసి, మాయలలో ఆరి తేరిన విద్యుజ్జిహ్వుణ్ణి వెంటబెట్టుకుని, సీత వద్దకు బయలుదేరాడు.

## చందమామ రామాయణం క్విజ్

రావణుడి మొట్టమొదటి దూత ఎవరు?

a. శుకుడు b. సారణుడు c. విభీషణుడు

మీ సమాధానాన్ని CRQ <a/b/c> ఫార్మెట్‌లో 54646కు SMS చెయ్యండి. ఎంపిక చేయబడ్డ ఐదుగురు అదృష్టవంతులైన విజేతలకు కామిక్ కాంబో ప్యాక్ అందజేస్తాం.




అతను విద్యుజ్జిహ్వుడితో, ''మనం మాయ చేత సీతను మోసపుచ్చాలి. నువ్వు మాయ చేత రాముడి తలను కల్పించి, ధనుర్బాణాలతో సహా దాన్ని తీసుకుని నావెంట రా,'' అన్నాడు.

విద్యుజ్జిహ్వు డందుకు సమ్మతించి, రావణుడు బహుమానంగా ఇచ్చిన ఆభరణాన్ని తీసుకుని వెళ్ళిపోయాడు. రావణుడు అశోకవనంలో రాక్షస స్త్రీల మధ్య ఉన్న సీత వద్దకు బయలుదేరి వెళ్ళాడు.






# తొందరపాటు

సరస్వతి ధనవంతుల బిడ్డ. ఆమె తల్లి చిన్న తనంలోనే పోయింది. ఒక్కగానొక్క బిడ్డ కావటం చేత తండ్రి ఆమెను చాలా గారా బంగా పెంచాడు. ఆమెకు యుక్తవయసు వచ్చింది. తండ్రి ఆమె కోసం సంబంధాలు చూస్తున్నాడు.

సరస్వతి ప్రతి రోజూ సాయంకాలం ఊరి చివర, కొండమీది కాళికాలయానికి వెళ్ళి, దేవిని దర్శించుకుని, చీకటి పడే వేళకు ఇంటికి తిరిగి వచ్చేది.

వరసగా నాలుగు రోజుల పాటు ఒక యువకుడు సరస్వతి కన్నా ముందుగానే వచ్చి, కోనేటి గట్టు మీద కూర్చుంటున్నాడు. ఈ సంగతి సరస్వతి గమనించింది. అయిదో రోజు అతడు సరస్వతిని సమీపించి, ''నా పేరు భూపతి. నీ పేరు సరస్వతి అని నాకు తెలుసు. నేను నిన్ను మనసారా ప్రేమిస్తున్నాను,'' అన్నాడు. సరస్వతి కొంచెం కంగారు పడి, ''మా నాన్నతో మాట్లాడు,'' అని చెప్పి, వడివడిగా కొండ దిగిపోయింది.

మర్నాడు భూపతి సరస్వతి తండ్రి వద్దకు వచ్చి తన కోరిక తెలియజేశాడు. అతడు సరస్వతిని పెళ్ళాడగోరుతున్నాడని తెలిసి సరస్వతి తండ్రి, అతణ్ణిరెండు రోజుల పాటు తమ ఇంటి అతిథిగా ఉండమన్నాడు.

భూపతి వారి ఇంట రెండు రోజులు గడిపాడు. ఈ రెండు రోజుల పరిచయంతో సరస్వతి మనస్సు భూపతికి అనుకూలంగా మారింది. కానీ మూడవ రోజు ఉదయమే ఆమె తండ్రి భూపతితో, ''ఇక నువ్వు వెళ్ళ వచ్చు, నీకూ సరస్వతికీ వివాహం జరగదు,'' అని చెప్పేశాడు.

ఆ రోజు సాయంకాలం సరస్వతి కోనేటి గట్టున భూపతిని కలుసుకుని తన తండ్రి

**25**-ఏళ్ళనాటి చందమామ కథ



ప్రవర్తనకు క్షమాపణ చెప్పుకున్నది. ''ఇక ఆ ప్రసక్తి అనవసరం. నీ కిష్టమైతే చెప్పు, ఇద్దరమూ ఆ అడవి దాటి వెళ్ళిపోయి, ఎక్కడైనా సుఖంగా బ్రతుకుదాం,'' అన్నాడు భూపతి.

సరస్వతి సంశయిస్తూ, ''మనం బ్రతికే దారి ఏమిటి?'' అని అడిగింది.

''నీ కెందుకా భయం? నేను కాయకష్టం చేసి అయినా సరే, మన ఇద్దరి పొట్టలూ నింపుతాను,'' అన్నాడు భూపతి.

మర్నాడు అదే సమయానికి తన నిర్ణయం చెబుతానని భూపతికి మాట ఇచ్చి, సరస్వతి ఇంటికి వెళ్ళిపోయింది.

మర్నాడు అదే స్థలంలో ఇద్దరూ కలుసుకున్నప్పుడు సరస్వతి భూపతితో, ''మా నాన్న మన పెళ్ళికి ఎంత మాత్రమూ ఒప్పుకోవటం లేదు. మనం వెళ్లిపోదాం పద,'' అన్నది.

ఇద్దరూ కొండ అవతలి పక్కకు దిగి, నడక సాగించారు. చీకటి పడింది. ఇద్దరూ భయం భయంగా నడుస్తున్నారు. ఆ రాత్రి ఎక్కడ గడపాలా అని భూపతి ఆలోచిస్తున్నాడు.

ఇంతలో సరస్వతి దూరాన మిణుకు మిణుకుమంటున్న దీపం చూసింది. అక్కడ ఏదన్నా ఇల్లు ఉంటుందని, ఇద్దరూ దాని కేసి నడిచారు. వాళ్లు ఒక పాడుపడిన కొంప చేరుకున్నారు. దాని గూట్లో వెలుగుతూండే గుడ్డి దీపమే వాళ్లు చూసినది. ఇంటి బయట ఒక అరుగు ఉన్నది. ఇంటి తలుపులు చేర వేసి ఉన్నాయి. భూపతి తొయ్యగానే తెరుచుకున్నాయి. లోపలి గది నిండా ఎలుకలు. దాని వెనక రెండు చిన్న గదులున్నాయి.

ఒక గదిలో ఒక నడుము వంగిపోయిన ముసలాడు ఉన్నాడు. వాడు కూర్చుని ఉన్న మంచం పక్కగా నాలుగు రేకుపెట్టెలు, ఒక దాని మీద ఒకటి పేర్చి పెట్టి ఉన్నాయి. ముసలాడు వాళ్ళిద్దరినీ చూసి తుళ్ళిపడి, ''ఎవర్రా మీరు? మీకు మంచీ, మర్యాదా తెలీదా? చెప్పకుండా లోనికి వచ్చేస్తారా?'' అన్నాడు కోపంగా.

భూపతి పశ్చాత్తాపంతో, ''తలుపు తెరిచి ఉంటే వచ్చేశాం. ఈ రాత్రికి ఇక్కడ కాస్త ఆశ్రయం దొరుకుతుందా?'' అని అడిగాడు.

''దొరకదు,'' అని ముసలాడు ఖచ్చితంగా చెప్పాడు.

''ఆడమనిషి, రాత్రివేళ అడవిలో నడవటానికి భయపడుతోంది,'' అని భూపతి బతిమాలాడు.

‘‘సరే, అయితే పక్క గదిలో ఆ పిల్లను పడుకోమను. అందులో ఒక్క మనిషికే చోటు ఉన్నది. మధ్య గదిలో పడుకోలేవు, ఎలుకలు నిన్ను బతకనియ్యవు. నువ్వు వెళ్ళి అరుగు మీద పడుకో,’’ అన్నాడు భూపతితో ఆ ముసలాడు.

భూపతి అందుకు సమ్మతించాడు. పక్కన ఉన్న ఇరుకు గదిలో ముసలాడు ఒక చిన్న ప్రమిద వెలిగించి పెట్టాడు. అందులో ఉన్న చిన్న మంచం మీద సరస్వతి పడుకున్నది. భూపతి బయట అరుగు మీద పడుకున్నాడు.

రాత్రివేళ ముసలివాడి గదిలో అలికిడి అయి, భూపతికి మెలకువ వచ్చింది. ఏదో పెట్టెలు కదిలిస్తున్న ధ్వని వినపడుతున్నది. భూపతి ఆశ్చర్యపోయి, మూసి ఉన్న తలుపు కంతకుండా ముసలాడి గదిలోకి శబ్దం చేయకుండా చూశాడు.

ముసలాడు పైన ఉన్న మూడు పెట్టెలనూ పక్కన పెట్టి, అట్టడుగున ఉన్న పెట్టె తెరిచి, చూస్తూ మురిసిపోతున్నాడు. తరవాత వాడు ఆ పెట్టె మూసేసి, దాని మీద మిగిలిన పెట్టెలను యథాప్రకారం పేర్చి పెట్టాడు.

‘‘ముసలిపీనుగు చాలా డబ్బు దాచినట్టున్నాడు. ఈ అడవి మధ్య కాటికి కాళ్ళు చాచుకుని ఉన్నవాడు ఆ డబ్బంతా ఏం చేసుకుంటాడు?’’ అనుకున్నాడు భూపతి.

తరవాత అతను సరస్వతిని లేపి, తాను చూసినదంతా చెప్పి, ‘‘రేపు కూడా మనం ఇక్కడే ఉందాం. రేపు రాత్రికి దీని అంతు



తేల్చుకోవాలి,’’ అని చెయ్యవలసినదంతా ఆమెకు చెప్పాడు.

మర్నాడు అతను ముసలాడితో, ‘‘ ఈ రాత్రికి కూడా మేం ఇక్కడే ఉంటాం,’’ అని చెప్పి, అడవిలో వేటకు బయలుదేరి పోయి, చీకటి పడ్డాక తిరిగి వచ్చాడు.

ఆ రాత్రి కూడా ముసలాడు పెట్టెలను దించి, అడుగు పెట్టెలోకి చూసి ఆనందించాడు. సరస్వతి, భూపతి చెప్పిన ప్రకారం, ముసలాడి గది తలుపు తట్టింది.దాంతో ముసలాడు తలుపు తెరిచాడు.

‘‘అరుగు మీద పడుకున్న భూపతి కనిపించడం లేదు. భయంగా ఉన్నది. వెతుకుదాం రా,’’ అన్నది సరస్వతి ఆ ముసలాడితో.

ఇద్దరూ బయటికి వెళ్లారు. తలుపు వెనకే నక్కి ఉన్న భూపతి ముసలాడి గదిలోకి

దూరాడు. కొంచెం సేపు గడిచాక అతను ఇంటి బయటికి వచ్చి, సరస్వతి కనిపించ గానే, ''నిద్రపట్టక అలా తిరిగి వచ్చాను. నువ్వు అనవసరంగా ముసలాయనను శ్రమ పెట్టావు. ఇద్దరూ వెళ్ళి పడుకోండి,'' అన్నాడు. ముసలాడు తన గదిలోకి వెళ్ళి, తలుపు మూసి పడుకున్నాడు.

భూపతి సరస్వతి గదిలోకి వచ్చి ఆమెతో, ''ముసలాడు డబ్బేమీ దాయలేదు. ఆ పెట్టెలో, వాడి పెళ్ళాంది కాబోలు, చిరుగులు పట్టిన చీర ఉన్నది,'' అన్నాడు.

సరస్వతి వెటకారంగా నవ్వి, ''నాకా సంగతి ముందే తెలుసు,'' అని రెండు రోజుల క్రితం తానూ, తన తండ్రీ కలిసి చేసిన ఆలోచన వివరించి చెప్పింది.

అప్పుడు జరిగినదేమంటే, తనకు భూపతిని పెళ్ళాడాలని ఉన్నట్టు సరస్వతి తన తండ్రికి చెప్పింది.

''వాడు నిన్ను ఎలా పోషిస్తాడు?'' అని తండ్రి ఆమెను అడిగాడు. ''అవసరమైతే కాయకష్టమైనా చేస్తాట్ట!'' అన్నది సరస్వతి.

ఆమె తండ్రి నవ్వి, ''అన్నీ ఉత్తమాటలు. వాడు మన ఇంట ఉన్న రెండు రోజుల్లో నేను కనిపెట్టాను. వాడికి డబ్బు మీద తగని ఆశ. డబ్బు కోసమే నిన్ను పెళ్ళాడతానంటున్నాడు. అది రుజువు చేస్తాను. నేను రుజువు చెయ్యలేకపోతే నువ్వు నిరభ్యంతరంగా వాణ్ణి చేసుకోవచ్చు. రేపు సాయంత్రం నువ్వు వాడితో వెళ్ళిపో. అడవి మధ్య కొంపలో నేనొక మనిషిని ఏర్పాటు చేస్తాను. అతను భూపతికి డబ్బాశ పెట్టి, వాడి అసలు రంగు బయట పెడతాడు,'' అన్నాడు.

అందుకు సరస్వతి ఒప్పుకున్నది.

ఇదంతా చెప్పి, ''మా నాన్న అన్నది ప్రత్యక్షంగా రుజువు అయ్యింది. ఆయన ఇలా చెయ్యకపోతే, తొందరపడి నిన్ను పెళ్ళాడి, జీవితమంతా దుఃఖ పడేదాన్ని. బ్రతికి పోయాను! ఇక నీ దారి నీదీ, నా దారి నాదీ!'' అన్నది.

భూపతి ఆమె ముఖం చూడలేక ఎటో వెళ్ళిపోయాడు. సరస్వతి ముసలాడి వెంట తన ఇంటికి వెళ్ళిపోయింది.








సువర్ణ ద్వీప మాణిక్యానికి సంబంధించిన రక్తసిక్తమైన నిగూఢ చరిత్ర ఆర్యకు తెలియవచ్చింది. మరేకుల మంత్రగత్తె మారిఘా గురించి అతడు మరింత తెలుసుకోవాలనుకున్నాడు.

మారిఘా కొండపై నుంచి కిందికి దూకేసిందని కొందరు చెబుతారు.

తూరుపు ప్రాంతంలో ఆడ తోడేలు రక్త దాహంతో తిరుగుతున్నది!

రాజా, ఈ రెండింటిలో ఏది నిజమని తీసుకున్నా ఫరవాలేదు. కాని మీ భార్యకు దుస్స్వప్నాలు రాకుండా ఉండాలంటే మాత్రం నువ్వు...

...స్వయంగా తూరుపు ప్రాంతానికి వెళ్ళితీరాలి.



అదే సమయంలో, ఆర్య ప్రధాన సలహాదారు ప్రభాత్ తూరుపు ప్రాంతం చేరాడు.

ఇక్కడ కనిపించకుండా పోయే పిల్లల గురించి నువ్వేమైనా విన్నావా?

తూరుపు ప్రాంతంలో దానిని గురించి విననివారెవరు ఉంటారు?

నేను మీకు సాయపడడానికే వచ్చాను. నన్ను మీ రాజప్రతినిధి వద్దకు తీసుకువెళ్ళగలవా?

తూరుపు ప్రాంతం వీధులగుండా వెళుతూండగా సగం మరిచిపోయిన కలలా ఏవో పాత జ్ఞాపకాలు మనసులో కదలాడాయి.


సంగతేమిటో
తెలుసుకు రమ్మని
నేనిప్పటికే ప్రభాత్‌ను
పంపి ఉన్నాను.
ఏమిటీ!
ప్రభాత్‌నా?
అవును. అయినా
మీకు అతడు తెలుసా
ఏం?
ఆ పని మీద
ప్రభాత్ వెళ్ళడం మంచిదే.
మరి నీ సంగతేమిటి?
నువ్వు చాలా
సూక్ష్మగ్రాహివి
రాజా!
అక్కడి రహస్య పథకాన్ని,
బట్టబయలు చేయాలంటేనువ్వే
స్వయంగా వెళ్ళక తప్పదు.
నా నుదుటిరాతను
ఎరిగిన వ్యక్తి లాగా
మాట్లాడుతున్నావు.

అదే సమయంలో అక్కడ ప్రభాత్ తూరుపు ప్రాంతరాజ ప్రతినిధిని కలుసుకున్నాడు.

తూరుపు ప్రాంతానికి స్వాగతం!

ఇక్కడ జరిగే దుర్ఘటనలు తెలిసి మన రాజుగారు తీవ్ర విచారానికి లోనయ్యారు. అసలు ఇవి ఎప్పటి నుంచి ఆరంభమయ్యాయి?

అది బందిపోట్ల పని అని మేము మొదట భావించాము. డబ్బులు రాబట్టుకోవడానికి వాళ్ళు ఒక్కొక్కసారి మనుషులను అపహరించే వారు. వాళ్ళను పట్టుకోవడానికి మా రక్షక భటులను పంపాను. గాని, వాళ్ళు ఒట్టి చేతులతోనే తిరిగి వచ్చారు.

ఏదైనా ఒక కూపీ, సూచన, సందేశం లభిస్తుందేమోనని ఆశించాము. అయితే, ఒక్కటీ దొరకలేదు.

ఆ తరవాత ఏం జరిగింది? కనిపించకుండా పోయిన పిల్లల మధ్య ఏదైనా సంబంధం ఉన్నదా?

ఉన్నది. అలా కనిపించకుండా పోయినవాళ్ళు ఒక్కరూ తిరిగి రాలేదు.

ఇంకా వుంది

# చందమామ లోకజ్ఞానం క్విజ్ - 3

(పదహారేళ్ళ లోపు పిల్లలకు)

**Co-sponsored by Infosys FOUNDATION, Bangalore**

అన్నీ సరైన సమాధానాలు రాసిన ఒకరికి బహుమతి రూ. 250లు.*

*సరైన సమాధానాలు రాసినవారు ఒకరికన్నా ఎక్కువ మంది ఉన్నట్టయితే ఒక్కొక్క విజేతకు 50 రూ.లు బహుమతిగా ఇవ్వబడుతుంది.

మీరు చేయవలసిందేమంటే :

1. సమాధానాలు రాయండి.
2. మీ పేరు, వయసు( 16 ఏళ్ళలోపు ఉండాలి) పిన్ కోడ్‌తో సహా పూర్తి చిరునామా రాయండి.
3. చందాదారు అయితే, ఆ నంబర్ రాయండి.
4. కవరు మీద చందమామ లోకజ్ఞానం క్విజ్ - 3 అని రాసి, చందమామ పూర్తి చిరునామా రాసి మాకు పంపండి.
5. ఏప్రిల్ నెలాఖరులోగా మీ ఎంట్రీ మాకు అందాలి.
6. జూన్ నెల సంచికలో ఫలితాలు వెలువడుతాయి.

## ప్రపంచ చరిత్ర




1. ప్రపంచాన్ని చుట్టి వచ్చిన మొట్ట మొదటి నావికుడు ఎవరు? ఎప్పుడు?
2. మెసపుటోమియా అని పిలువబడిన దేశం ఏది?
3. అత్యధిక కాలం పాలించిన చక్రవర్తిని ఎవరు? ఎంత కాలం?
4. జోన్ ఆఫ్ ఆర్క్ సజీవ దహనం చేయబడినప్పుడు ఆమె వయసు ఎంత? అది ఎప్పుడు జరిగింది?
5. హిట్లర్ 'సీక్రెట్ సర్వీస్'ను ఏమని పిలిచేవారు?
6. తను పదవిలో ఉన్నంతకాలం ఒక అమెరికా అధ్యక్షుడు ఎవరితోనూ కరచాలనం చేయ లేదు. ఆయన ఎవరు? ఆయన దేశాధ్యక్షుడు ఎప్పుడయ్యాడు?

## Avail the loyalty bonus!

**Chandamama Subscribers will get flat 20% off on subscription renewals! (All Editions)**



# Chandamama!

**Because stories make the world go round...**

**Choose your Chandamama!**
**Go to www.chandamama.com or SMS CSHOP to 54646 & we'll get in touch with you!**
**Subscribe Now!!**



**Chandamáma is available in English and 12 regional languages. Junior Chandamama for children below 9 years is available only in English.**

I want to subscribe to / gift / renew subscription for the following editions of Chandamama:

☐ English ☐ Telugu ☐ Tamil ☐ Kannada ☐ Hindi
☐ Marathi ☐ Gujarati ☐ Oriya ☐ Bengali ☐ Sanskrit
☐ Santali ☐ Malayalam ☐ Assamese ☐ Junior

Name: ..........................................................................................

Date of Birth: .................................. Sex ..................................

Address: ..........................................................................................

..........................................................................................

..........................................................................................

.................................................... City: ..........................................

State:...................................... Pin:..........................................

Telephone:..........................................................................................

Mobile:..........................................................................................

Email:..........................................................................................

Subscription Number 9for renewals):..........................................

Gift Subscription to the following address:

..........................................................................................

..........................................................................................

..........................................................................................

..........................................................................................

Enclosed Cheque/DD* for Rupees..........................................

Cheque/DD No ..........................................................................

favouring Chandamama India Ltd on..........................................

..........................................................................................bank.

*Add Rs.60 for non-Chennai cheques. Your subscription will commence in 4 weeks.

Please mail the subscription form to:
**Chandamama India Limited,**
New 2/513 (Old 3/396) Sundeep Avenue East,
2nd Main Road, Chinna Neelankarai,
Chennai - 600041. Phone: (044) 43992828, Fax: (044) 43992829
Email: subscription@chandamama.com
You can also subscribe online at: www.chandamama.com

| Take Your Pick! | 1 YEAR | 2 YEARS | 3 YEARS | 4 YEARS | 5 YEARS |
|---|---|---|---|---|---|
| ENGLISH (Rs. 25/- per copy) | Rs. 300 | Rs. 540 | Rs. 765 | Rs. 960 | Rs. 1125 |
| **You Save** | | **Rs. 60** | **Rs. 135** | **Rs. 240** | **Rs. 375** |
| REGIONAL (Rs. 20/- per copy) | Rs. 240 | Rs. 430 | Rs. 610 | Rs. 770 | Rs. 900 |
| **You Save** | | **Rs. 50** | **Rs. 110** | **Rs. 190** | **Rs. 300** |
| JUNIOR (Rs. 15/- per copy) | Rs. 180 | Rs. 325 | Rs. 460 | Rs. [illegible]75 | Rs. 675 |
| **You Save** | | **Rs. 35** | **Rs. 80** | **Rs. 145** | **Rs. 225** |

**Annual Subscription Overseas :** US $40 for English Chandamama, US $30 for Regional Languages, US $25 for Junior Chandamama (including shipping and handling charges) by air mail.

# విజ్ఞానం... వినోదం... వికాసం...

## విజ్ఞాన వీచికలు




## జంతువుల అద్భుత విశేషాలు

జంతు ప్రపంచాన్ని పరిశీలిస్తే నమ్మలేనన్ని అద్భుత విశేషాలు చాలా కనిపిస్తాయి. ఏనుగు తొండం నేలపై పడి ఉన్న అతి చిన్న సూదిని సైతం పైకి తీయగలిగినంత సునిశితమైనది.

జిరాఫీ మెడ అంత పొడవుగా ఉన్నది కదా? అంత పెద్ద మెడలోనూ మామూలుగా మనిషి మెడలో ఉన్నట్టే ఏడే ఏడు ఎముకలు ఉన్నాయి!

నీలి తిమింగిలం పాట 188 డెసిబల్స్ శబ్దంతో ఉంటుంది. అంటే రాకెట్ అంత శబ్దం పుట్టిస్తుందన్నమాట! కొన్ని జంతువులు అసలు శబ్దం పుట్టించవు. అయితే, తమ పిల్లలు ఎక్కడ ఉన్నాయో పసిగట్టడానికి తగిన వేరువేరు మార్గాలను అవలంబిస్తాయి.

కంగారూ పుట్టేప్పుడు చిక్కుడు గింజంత పరిమాణంలో కూడా ఉండదు. అది పూర్తిగా ఎదిగేలోపల అంతకు దాదాపు 60,000 రెట్లు పెద్దదవుతుంది! ఆ విధంగా అత్యధికంగా పెరిగే క్షీరదంగా అది ఒక ప్రత్యేకతను సంతరించుకున్నది.

## మన పరిసరాలు

## వంట గదుల నుంచి వాహనాలకు




ప్రకృతి వనరులు రోజు రోజుకూ అడుగంటుతున్నాయన్నది అందరికీ ఆందోళన కలిగించే విషయం. వినియోగదారులు విపరీతంగా పెరగడం వల్ల వనరులు త్వరితగతిలో తగ్గిపోతున్నాయి. పెట్రోలియం విషయంలో అయితే ఇది మరీ ఎక్కువ!

రవాణాకు ఆధారశక్తిగా ఉంటూన్న పెట్రోలుకు ప్రత్యామ్నాయంగా ఇతర ఇంధనాలను ఉపయోగించే అవకాశాలను అన్వేషిస్తూ పరిశోధనలు జరుగుతున్నాయి. ఈ విషయంలో చారిస్ ఫోర్డ్ అనే విజ్ఞానవేత్త పెట్రోలుకు ప్రత్యామ్నాయంగా వాహనాలను నడపడానికీ, ల్యూబ్రికేషన్‌కూ వెజిటబుల్ ఆయిల్స్ అంటే కూరగాయలనూనెలను ఉపయోగించవచ్చని సూచిస్తున్నాడు.

బయోడిగ్రేడబుల్, నాన్ టాక్సిక్, మళ్ళీ మళ్ళీ ఉపయోగించదగ్గవి కనుక ఈ వెజిటబుల్ ఆయిల్స్ పర్యావరణానికి హాని కలిగించనివిగా కూడా ఉంటాయని ఫోర్డ్ చెబుతున్నాడు. వాటిని ఇంధనంగా ఉపయోగిస్తే గ్రీన్ హౌస్ గ్యాస్‌ను అసలు వెలువరించవు.

# ఫోటో వ్యాఖ్యల పోటీ

ఈ ఫోటోలకు ఒక్క మాటలోగాని, చిన్న వాక్యంలోగాని వ్యాఖ్యలు రాయగలరా? రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.



TATA NARAYANAMURTHY





TATA NARAYANAMURTHY

వ్యాఖ్యలను కాంపిటీషన్ పోస్ట్‌కార్డుపైన రాసి ఈ నెల 25వ తేదీలోగా మాకు అందేలా పంపాలి.
పోటీ ఫలితాలు జూన్ 2009 సంచికలో ప్రచురిస్తాం. ఉత్తమమైన వ్యాఖ్యకు రూ. 100 బహుమానం.
ఫోటో వ్యాఖ్యల పోటీ: చందమామ ఇండియా లిమిటెడ్,
**2/513,** సందీప్ అవెన్యూ ఈస్ట్, సెకండ్ మెయిన్ రోడ్, చిన్న నీలాంగరై, చెన్నయ్ - **600 041**

## అభినందనలు

ఫిబ్రవరి నెల పోటీ ఫలితాలు
టి.రాజేశ్వరి
8-1-72/1, 'హనుమ'
పెదవాల్తేరు
విశాఖపట్నం - 524 002
(ఆం.ప్ర.)

ఫోటో వ్యాఖ్యల పోటీ:





మొదటి ఫోటో : ఇవ్వండి కొంచెం చేయూత!
రెండవ ఫోటో : బాగుంటుంది భవిత!!

## సమాధానాలు :

1. దామోదర్ సావర్కార్ 2. డా.రాజేంద్ర ప్రసాద్ 3. ఆర్.కె.నారాయణ్
4. నారాయణ్ కార్తికేయన్ 5.కంబన్ 6. తగళి శివశంకరన్ పిళ్ళై
7. మహారాజా రంజిత్ సింగ్ 8. కరికాల చోళుడు

**Printed and Published by L. Subramanyan at B.N.K. Press Pvt. Ltd., Chennai - 26 on behalf of Chandamama India Limited,**
JVL Plaza, 6th Floor, 626 (Old 501), Anna Salai, Teynampet, Chennai - 600 018. **Editor : L. Subramanyan**

CHANDAMAMA (Telugu) April 2009 Registrar of Newspapers of India No. 1114/57. Regd No. TN/CH(C)/216/09-11
Licensed to post WPP - Inland No.TN/CC(S)Dn/84/06-08, Foreign No. 85/06-08








# బుబ్బా సాహసాలు




విరామం గంట మోగగానే పిల్లలందరూ స్నాక్-బాక్సస్‌తో తరగతుల నుంచి ప్లే గ్రౌండుకు పరిగెత్తారు.



ఒక వైపు కొందరు పిల్లలు గుమిగూడారు.




మా అమ్మ పీచ్ పంపింది, ఆహా!



నా దగ్గర కూడా ఒక తియ్యటి మ్యాంగో గానీ పీచ్ గానీ ఉంటే బావుండేది కదా!



ఆకాష్ పక్కన ఉన్నట్టుండి బుబ్బాలూ ప్రత్యక్షమయ్యాడు.




బుబ్బా ఆకాష్‌కు బుబ్బాలూ అందించాడు.




ఆకాష్ గమ్ నుంచి నోట్లోకి జ్యూస్ పిండుకున్నాడు.




మాకూ ఒకటి ఇస్తారా?




తలా ఒకటి ఇచ్చాడు.

బుబ్బా, పిల్లలందరూ బబుల్ ఊదారు.




